సీ. మదిరకు మీారేగ మరునాఁడు రేపడి
యొడ సొబగొప్పార నేగుదెంచి
నల్లనయ్యను డాసి నాతండ్రి యాకొంటి
విచ్చెదఁ బాల్ద్రావు మిప్పుడనుచుఁ
తొడలపై నిడుకొని దూబ యారక్కసి
వల చన్ను గఱపింప వాబిగించి
గ్రుక్కగ్రుక్కకు మేనుసొక్క నెత్తురు ద్రావి
వడి గోడు గుడిచిన విడక పీల్చి

గీ. యొడలి పెనుగాలి వెడలించెఁ గొడుకుఁ గుఱ్ఱఁ
డాపె రొమ్మునననున్న వాఁ డతనిఁ దెచ్చు
చెట్టులో దగఁజేయుఁడంచింతు లడల
వెఱగు జెందిరి గొల్లలు వింత యనుచు. ౧౭౩

వ. కొండొక తడ వట్లుండి యంతం దెలివి దెలుపుకొని
తాల్మియుం జెల్మియుం బైకొనఁ బిల్లకం దీసి తల్లికిచ్చి
యొక్కపెట్ట నందఱు గంద్రగొడ్డండ్ల మోటకత్తులఁ గడికం
డలుగఁ జిదిమి మేల్జావలకు తావలంబైన యడవివ్రాకుల
నటికి వాము లమరించి కాడు గావించి యందగలంబైన
యగ్గిం బ్రేరేచి రవులుకొల్పి యందుఁజేర్చి రొడ లపుడు.

గీ. దానియొడలు గాలుతఱి మంచి వలపాపె
నన్నికడల కంపు లంత వారు
దోసకారియొంట దొడరు చెట్లే మంచి
వలపటంచు వెఱఁగుపడిరి కూడి. ౧౭౪

కం. కొడుకు దనఁ చేతిలో నిడి
మిడుకుచు నా రేని బడఁతి మెత్తని పెండ
న్నడు దయ్యాలం జదువుచుఁ
దడఁబడుటలు మాని నిల్చెఁ దాలిమి కతనన్. ౧౭౫

కం. చచ్చెడు మండెడు చానకు
నిచ్చె న్మేలిక్కఁ జేరి యుచ్చుఁ జరింప
న్నచ్చి మగనిఁ గని పెంచిన
మచ్చెకనుల తల్లి కెట్టి మచ్చిచ్చునొకో. ౧౭౬

మ. ఇటు లెల్లారుఁ దలంపఁగాఁ జిఱుతబిడ్డే మంటెనో గాములం
చటకుం జాపలఁ బిల్వఁ బంచి తొలి పల్కాడించి వేనోళ్ల ను
క్కట బల్దీవనలంది వారి కిడి యొక్క గ్గైసేసి పాలిచ్చు నా
తుటుము న్వాయిఁటినంటుఁడిచ్చెసిరి దోడ్తో గొప్పలో నుప్పుఁగన్

గీ. నల్లమేసామి పుడమిలో నవి జరిపిన
కతలు జడదారిచే విని కాన కంతు
కత్తిమనుమఁ డామీఁదటి కతలనెల్ల
నానతిమ్మని వేఁడె నెయ్యంబు నెరపి. ౧౭౭

కం. వలిమలరాకూఁతురి పొ
త్తులవాఁడా వెండికొండ తొలి బోడ్లిల్లె
మెలగు పిపాసుల ఱేఁడా
పలుకొమ్ముల మొకము తిత్తిబట్టగు వేల్పా. ౧౭౮

ఉ. బొల్లిమొగంపుఁ బక్కిదొర పూనెడు వెన్నుని జోడుకాఁడ మి
న్నల్లెలనుండు పోటరులఁ బట్టి వెలంబొరిగొన్నదిట్ట పో

న్మల్లెల తేని సేన! యిరుమోరలదేవర చంద్రప్రొద్దు క
న్నులలుగాఁ బొసంగి మలకూఁతురి నేలినబూఁడిదంటుడా. ౧౮౦

సుగంధివృత్తము. పాపతేఁడులెల్ల మేనఁ బ్రాఁకిచాలఁగొంటులున్
దాపలెక్కి పచ్చజన్నిదంబు వ్రేలి కుంగరా
లాపి కుత్తుకంటి వ్రేలునట్టి పేరులైతగం
గా పసిండిగట్టువిల్లుగా మెలంగు దేవరా. ౧౮౧

సీ. ఇవపుపెన్మలబిడ్డ యొకిమీఁని నెనరుచేఁ
దోఁచిన యల్లిక దొలకువాఁడఁ
బాటిబండను పేరఁ బరగు నిల్వాడి నొప్పి
పురుషోత్తమాఖ్యఁ బెంపొందినాఁడ
గిన్నెపేరిటివాని వెన్నుండు గెల్చిన
కతలన్నియును గూర్పఁగడగినాఁడఁ
దెలుఁగునఁ గబ్బంబుఁ గలిగింప సమకట్టి
తిందు మొదటిపాళ మిటుల ముగిసె

గీ. దీనిఁ బుడమిని నెవ్వరు తీపులూనరఁ
జదివినను బెరవారికి సరవి దెలుపఁ
దమకుఁ గామె సిరుజ్లేమఁ దలఁగుఁ గీడు
లట్టివారికి నల్లనయ్యాను వరుప. ౧౮౨

మొదటి పాళము

ముగిసెను.

ఓమ్.

# కంసవిజయము.

## రెండవ పాళము.

కం. బంగరు మలసింగిణివలి
మింగుడు పాన్పమ్మనిడుపు మిన్నయగాఁడా
నింగి దిరుగాడుపల్లెల
పొంగడచిన పుడమితేరు పూసికవేల్పా. ౧

వ. వినవోదల యొడ్డుము. ౨

గీ. మించు జోగిమొగము గాంచిరక్కసికూలఁ
గట్టినేస్తమెల్లుగాఁ జరించె
ననుచుఁ గడుపులోన మనిచినసామిని
వెదకురాచఁడముగ వినిచె నతఁడు. ౩

కం. మన్నించి తల్లిబిడ్డకుఁ
దిన్నని పఱపమరఁబఱచి దీవనలొప్పన్
బిన్నయ్యా పండుమని పని
కన్నెలఁతుక సాగరొప్ప నరిగెం బ్రీతిన్. ౪

శా. ఆయమ్మానలఁబోవఁగంసుఁడనువాఁడంషంగనేతెంచియు
ల్డాయంబోయి తరిందలంపుచును దేడాలేక కాపుండి సం
దాయెన్నాయులఁ జేయనంచు శకడాయహా దొడ్డరాకాసితాఁ
దాయుంగన్గొని కానట్టు లడగెం దాతయ్య కన్నోమ్మద్దుతోన్.

చ. ఒఱగిన మాయదారి చెడు గొంటుముగాఁగని శౌరికాలివే
ల్తుదఁబడఁ వాఁచఁగఁ గండ్లిరుసు తోరపు పైపరమెల్లఁ బెల్లుగాఁ
జిగురుపలయ్యెఁదల్లడముఁ జెంది పొలందిను రాతుగూలనె
ల్లిద మొనరించె వేల్పుగుమి లేవడిమాటల సదడింపుచున్.

మ. బలురాకాసి బిరాననేలఁ గలపం బాటిల్లె నాగుబ్బుజొ
బ్బిలు పెంజప్పుడు దాసికిం జెవుడుగా బిట్టుల్కి కన్నమ్మద
వ్వుల కేతెంచి దిగుల్నెగుల్గలఁపఁ జావుంగన్న రేదివ్రమ్మరిన్
బలుగాకన్గని పోయి చెప్పె పిలచెం బల్లెంగలా గాఁపులన్.

గీ. వారు వచ్చిచూచి వకవక నగిపిల్ల
వాజ్ఞసోకి చచ్చి తరిదిబిరుద
వనుచు వాఁగూర్చి యూఁదుచుఁ గత్తుల
నొత్తిమంటఁగలిపి రొడలిత్తి. ౮

వ. అటమీఁదట గొల్లలందఱుం గూడుకొని తమలో నిట్లని
తలపోసిరి. ౯

సీ. బండియై మానిసి దండిపైఁగొని బిడ్డ
కాల్దాకి వడుపెట్లుగాటు పెద్ద
గాలియు విసరదు గడుసు లెవ్వారును
బోరాడి కూల్చిన చాలు లేదు
పెరవారలెవ్వరీ పిల్లదాపుననుండి
చూడలే దీచూడ్కి వీనుమడిసె
మున్నాడి యుప్పెఁగలొమ్మనయ్యుఁ బల్లియ కని
తెలిసి వక్కాణించె దేవకమ్మ

గీ. మగఁడు సెప్పుమాట నిజమయి నెగడసాగ
జిన్నబిడ్డలఁ బ్రతికించుఁ జెలియ లెట్టు
లనుచు వగచిరి మందయం దెనయువారు
వరకని మొదల్తు దంటుల నెఱుఁగకుంట. ౧౦

కం. ఆఁదోక బాలునోడలం
బామకొలిపి పంచితంబు పైఁజల్లి యశో
దాదేవి కొమరు నెత్తుక
చేఁదవుడుచు నోడలు నెలమిఁ జెందె నెడందన్. ౧౧

వ. అంతనొక్కనాఁడాయమ్మ కొమ్మలతోఁగూడ నింటిపనుల బడియుండి మఱచియున్న వెన్నుని మన్నిగొనంబొంచి పంచ నుండి రక్కసి మన్నెతృణావర్తుం డనువాఁడు సుడిగాలి రూపున నేలదువ్వ రేపి క్రొవ్వెగఁదొట్టి కవ్వడి చెలి నవ్వటాలకుఁ బైకెత్తియెత్తుకొని జరుగఁగు రంగటివారు గారుకొని పేరురంబులు మోదుకొనుచు రొదసేయ విని తల్లితల్లడంబున నందు పిల్లనిం గానక డిల్లపడి యెల్లదెసలం జూచుచుండె నంతట. ౧౨

మ. సుడిగాలింగను రెప్పలెత్త నెడముంజొచ్చంగఁ దావందమి
న్నొడవన్నూలెడు ప్రేలఁగాంచి నిసువా గొల్లాతఁడీ పట్టున
న్నడకన్జూపకయున్నఁజుట్టలు దిగుల్గారొక్కండురం చెంచి బా
గొడియన్మానిసి దిండికుత్తుకను బెంపొప్పన్బిగింబెన్వడిన్॥

ఉ. చేతులగొంతు దొట్టికొని చిక్కతి వెక్కడబోదువంచుఁ జ
ట్రాతికి సూటిజూచి పడరా యని దిట్టతనాన నూకినం

బ్రాతరలాడి పై నిలువఁ బట్టఁగఁ జాలక రక్కసుండు కీ
ల్గాతములోనఁ గూలి తలగన్వాలనేదక జిక్కకుండుటన్. ౧౪

కం. విలవిలఁ దన్నుక చచ్చెను
బలమరి సుడిగాలి సమసిపడిన మొయి న్న
ల్లలవజ్జు బారెఁ గెంపులు
గల కాలువలనఁగ మంద కడపటినేలన్. ౧౫

కం. కాటుకకొండ తనంతట
పోటరినని మింటఁ దిరుగఁబోయిన వేల్పు
న్మేటిపిడుగొత్తి మొత్తుడు
కాలై తెగిపడ్డ కొండగతినా నెరిగెన్. ౧౬

గీ. పడి తృణావర్తు డీల్గుట పరఁగఁ గాంచి
గడ్డికాపరు లలమట గీటువుచ్చి
పెద్దగోయిబోడిమునుగంగఁ బూడ్చిరచటి
మన్ను పెనుపూరికట్టియల్ కొన్ని నెరపి. ౧౭

వ. అంత నా పట్టిం బట్టి తెచ్చి యనుంగు జుట్టంబులైన ముది
తెలివలుం దల్లియుఁ బొల్లి మోరపక్కి నెక్కుడు దంట
కంటె నేమొ గాములని కచ్చికబోతులిచ్చియు వేలిమిచే
వేడివెల్పు వేడుకొను నిక్కపు బొందళింపుటయ్యాల కాన
తిచ్చియుఁ గాపుబెట్టి రవ్వాల. ౧౮

సీ. ఒకనాఁడు గన్నమ్మ యోపికెఁ బెరుగొక్క
కుదురందు బానకుఁ గూడఁబోసి

తటిఁ జేతఁబూని వే తరువంగగమకించు
టఱసి పాల్దెమ్మని యడ్డగించి
యాపుకు వలదని యతివ మన్ననఁ జెప్పఁ
బలుకులు చెవులకుఁ బాఱకున్నఁ
బేరల్కతోఁ దల్లి బిడ్డనావలనూక
పెనుదాతి బానకుఁ బెట్టఁబోవ్వఁ
గీ. చెక్కలై యటి కందలో నొక్కబొట్టు
చిక్కకట మంటిపాలైనఁ జేడె కనలి
పెట్టుకుంటివి పెరుగు నీపొట్టననుచుఁ
బట్టనటికత్తె వెంబడి పట్టి బరవ. ౧౯

వ. అపుడు

మ. ఇటుఁబోవ న్వాను వెంటవచ్చు నటుఁబో నీమూలలందాగు లేఁ
డెటులో తెప్పున దాపెనఁ చవలఁబో పొంచొప్పుమందాడుచి
క్కటి నిక్కంబని యడ్డవేగ పడఁదాకుందోన బర్వెత్తుఁజొ
క్కటపున్నాదెలగంపలం దలుపుల న్గాలూఁ పోనెట్టుఁదాకన్.

కం. పొంకమగు జగములను బలు
గ్రుంకులు వెట్టించు ప్రోడ గునిసెడి తల్లి
న్వంకర కొంకర తిప్పులఁ
గ్రుంకిళ్ళం బెట్టు టఱుదె గునగున నడువన్. ౨౦

మ. ఇడుము ల్బెట్టకుమయ్య రారయని యాయిల్లాలు సేసాఁప నె
క్కుడు కూర్మిన్నగ ముందటన్నిలిచెఁ జేకొట్టంగ రాకాపె పెం
దుడుకా ద్రిప్పటఁ బెట్టి చిక్కితి వికెందుం బోవఁగాఁ జాల వి
య్యెడనిన్గట్టెద ఱోలఁ ద్రాటనని హాయిందెచ్చునచ్చోటికిన్

ఉ. తెచ్చి బిరాన నింటఁగల త్రిప్పుడు త్రాళ్ళమరించిపట్టి వా
నిచ్చిన నొవ్వఁజేతునని వెచ్చకు ఱోటికినంటఁగట్టి పె
న్గచ్చులు మానియుండుమని గాటముగాఁ జిడిసెప్పి బిడ్డపై
మచ్చికఁజూపకేగె పెరిమన్దగఁజూతురె కొంటెలైనచోఁ ౨౪

ఉ. బొజ్జ యొకింత పెంప ననఁబోఁడి బిగించినజ్జు త్రాళ్ళుమే
వజ్జదొఱంగు టింతిగని పల్పులు పగ్గము లాకుత్రాఁడులు
న్ముజ్జగమూను జేవరకు మోపి బిగించినఁ దక్కువైన నా
గుజ్జరిఁ గట్టఁదెచ్చెఁ దనకొంపఁగనంబడు సన్నిత్రాఁడులన్

మ. అవియున్దక్కువయైనఁ దల్లివగవన్ హాళిం బిసల్గులుల్కమే
న్దవులంజుట్టిన నొక్కత్రాట నిమిడెన్దా నిచ్చ మన్నించి మీ
దివియోఁడున్మఱి క్రిందివేఁడగుచు బ్రోదింగన్న తానంబులో
ప్పవు బొజ్జప్పగఁ గట్టఁ దల్లికసదే పాటింప నెవ్వారికిన్.

మా. పనులందోపిక తల్లిపోవఁగని చేవన్మద్దులైయున్న చ
క్కని లిబ్బుల్గలవాని బిడ్డలకుఁ దాకం బోరుకూడయ్యెడి
ట్టును బోఁగొట్టఁదలంచి జోల్జఱుపు చెట్లోవచ్చియుడ్డంబుగాఁ
జనరెండై యవిదగ్గువంబడియె నాసాముల్దిగుల్ గీల్కొనన్.

ఉ. ఆరొదసోకి పల్లెఁగలయందఱు దండడివచ్చి చూచి యీ
తేరులఁబోని మ్రాఁకుజతె తెప్పునఁ గూలుటవెట్లొ పావఁడీ
చేసువకెట్లు పోయెనొకొ చెంతకు ఱోల్వడి నెవ్వరిడ్చిరో
తోరపుఁగత్తిగొడ్డళులతో నఱుకం గల గాట్లు దెల్పవే. ౨౮

ఉ. ఏదని యిచ్చ నెంచుటకు నేర్పడకవ్వలఁ దప్పుచుండి ర
ప్పాపలనుండి వెల్వడిన బత్తులు నెత్తికిఁ జేతులెత్తి మే

మీఁదితి మొడ్డునబట్టితిమి యిమ్మగు కాఁపురమన్న సంద్రపుం
బైదరి నీదుచూపులను బల్కులమబ్బినఁగాదె వేలుపా ౨౯

సీ. నిను గొనియాడంగ నేరరు వేదల
ల్గల పాప తేఁడైదు తలలవేల్పు
నలుమొగంబుల పొగ్డ నానెంతవారము
దలపోయ మేమలఁతులము సుమ్ము
తొలుత నీజగములతో నేమిపనిగోరి
పుట్టించితో వానిఁ బ్రోవ నింత
కెన్నిమారులు బాము లెత్తితివో యిపు
డీరూపు దాల్చుట కేతలంపొ

గీ. తెలియ దీవజకీపాటి దెలిసె మాకు
నబ్బురంబైన చెయ్వుల ననువు పరుపఁ
జూచి విని చెప్పి మాబోటి శుంఠలెల్లఁ
గట్టతెగి నిన్నుగొల్వ నేగడ యని తుదిగ. ౩౦

గీ. దచ్చికడలేలు దొరలు నీదండనిలిచి
యరిదిపనులను సలుపంగ నెఱిఁగి మీర
లానుకొని రాకయుండిన గానఁ గాదె
పొలసుదిండుల చేఁ బడి రలమటలను॥ ౩౧

ఉ. ఒప్పనివారమైతి మొక యోరదొరా కలిమయ్య సంతునా
గొప్పగుకండ కొవ్వమరి కొంటెతనంబునఁ జేసినట్టి బల్
దెప్పరమైన చేతలు తుదిన్మొదలేర్పడ విన్నవింతు మో
యప్ప పరాకు మాని విను మయ్య యిలం గడతేర్పు దేవరా.

ఉ. మింటఁజరించు వాకఁగలిమిన్దగువారల మాట నచ్చర
ల్వెంటనె జంటలై తెరల వేకయిరేఁగఁగ జల్లులాడఁ బోఁ
గొంగెలమై మొలంటులగు కోకలపోకల కొప్పియుంటఁ గ్రే
గంటనెఱింగి నారదుఁడు గార్క్యుని పేరలుక న్మునుంగుచున్.

క. రౌక్యము గలవారలమని
నిక్యుచుఁ జరియించనేల నెలఁతలతోడ
నొబ్క్యస మబ్బినపెద్దల
పక్యల నొదుగుటలు మేలు బాటులు వినరే. ౩౪

క. గుటిదప్పి మీరుదిసులై
పరువులు బెట్టితిరి సీటఁ బడి యీ నెపమే
సరిపోయె మిమ్ముఁడిట్టఁగ
నిరువురు మద్దులయి పుట్టి డిత్తఱ నేటన్. ౩౫

చ. మద మొగదట్టి వేల్పు వెల మచ్చికనుంగవ వారిఁగూడ మీ
రిదిసుత మద్దులై పుడమి నెవ్వదగులొక్యను మంటిమీదమీ
కొదవెదు కస్తిమాన్పఁగలఁ డొక్యఁడు కొన్నగు రేబగళ్లు కా
మొదలిటి సామిఁగాంచఁదుదిముట్టెడుసాపనమబ్బులన్నియున్.

క. పాయక మద్దులరగు మీ
చాయన్ జోలీడ్చి తెచ్చి సరిగుంజుఁడు బ
ల్యాయల మాకులు గూలుం
గాయంబులు లేకబోరు కల్గుచుఁ దొఱఁగున్. ౩౬

కం. ఆమానుల తొరటలు మును
గీములుగానుండు మీరు కీలెడలిన సాం

పాముకొను రూపు లలవడ .
మీామసకింబట్టులంది మెలఁకువ మనుఁడా. ౩౮

ఆ వె. అనుచు నుడివి మింటనరిగె గాణలమేటి
యంత చెట్టులెతి మింతవఱకు
బ్రతికినారమయ్య పాఱుని కనికర
మోపె మిమ్ముఁజూప నెందెఱుఁగము. ౩౯

వ. అని పెక్కువగల రొక్కంపుఁజేనిబిడ్డలు నలకూబర మణి
గ్రీవులనువారు ముమ్మారు చుట్టు దిమ్మరి వలమురిదారి
యడుగులంబడి బడిబడి సెలవంది దాపలివాలుగల కడకరిగి
రిటదొడుకు పెనుపు లుప్పతిలు చుప్పలులలో నిదిగొప్పదని
ముప్పరిగొను నడలున గోడుగుడిచి యందు బొందు
సందుగొట్టుడుల బ్రమందించుచందంబు నెందుంగానక నా
పాక వెడలిపోక జోకయని ముందుండుట కవ్వలిచేదండ
నుండుదెసకొండ దండనొందు పూరిగండుమీరి మెందుగా
నుండు పసిమి కసవు బసుల కుబుసనియును జమునమొన
కొను మడుగుల నీరు కొరులేనిదనియును, బృంద యను
యడవిఁ బులి చిరుత సివంగి మనుబోతు పలుగొమ్ముల
మెకంబులు మొదలగు చెడుమెకంబులు లేవనియుం
బెర్కొని యావులు తరిపిదూడలెద్దులుఁ గిత్తలంబోలుకొని
యింటఁగలవంటపనిముట్లుఁ దొట్టులంగట్టిన బండ్లుఁదరలిం
చుకొని కొమ్ము లెమ్మెలుమీరఁబూరింపుచుఁబసులగాప
రులు రామకృష్ణుల ముందర నిడుకొని వెదురు క్రోవులు
పెదవులం దవులం బాడు పాటల మోటుమావులు చివు

ఱుల నివురుకొన నలరుచుం జని చని బృందావనంబుచేరిక
విడుదు లమరించుకొనియుండి రవ్వల.

ఉ. నందుని పల్లెలోఁ గలుగు నాతులయిండుల కేగి లచ్చిటేఁ
డందర కన్నిరూపులయి యాగడపుం బనులెన్నొసేయ నా
కందువసేఁతలం గోమలు గట్టిగఁదల్లికిఁ దెల్పిబేర్జపుం
జందనుమాన్పఁగాఁదలఁచిచయ్యనఁజేరిరియామెఁగానఁగాన్.

మ. మగువా నీకొమరుండు సేయుదుడుకుల్మన్నించిమేమెంతసే
పిగురంజేసిన నెక్కువయ్యె నిఁక మేమేలాగుప్రొద్దీగఁగా
నగుగద్దించియొ మంచిమాటలనొ పిన్నాతండు మాజోలిరా
కఁగుణిన్నిల్పఁదలంపుసేయు మెదలోఁగాకున్న రద్దేర్పడున్.

వ. అనిచెప్పియారేయి యూరకుండి మరునాఁడుం దిరుగవచ్చి
త్రొల్లింటిపనులెల్లకడల సళ్ళులేక జల్లించిన గొల్లచేడియ
లెల్లం దల్లిఁగని యిట్లనిరి. ౪౩

మ. తగవా నీకొమరుండు ప్రొద్దిటితఱిం దావచ్చి నాబిడ్డనిం
డగుచూలాలిని లేప కేమిపని చే నాచక్కఁబోకున్న మె
త్తగు దాపేర్పడఁగాఁ బరుండి యొకచేతన్జన్మనంబట్టి పైఁ
దెగువన్ వ్రాలుడుఁ గూకవేయునదిమూతిన్గిల్లెఁ బెన్గోరులన్

కం. నాకోడలు పంచం బని
తేకువనుండంగ వెన్కదెసకేగి వడి
న్గోకపయి కెత్త నఱచిన
నీకొమరుండుఱికెఁ దగునె నిల్కడవలదే. ౪౫

సీ. ఇలుసొచ్చి లోనింటఁ గలువుగడవఁ బెట్ట
యుట్టికై యెగఁబ్రాకి పట్టిదింపఁ
జాలక పీటల జతలెత్తు సవరించి
యెక్కి కడవవంచి మెక్కి పెరుగుఁ
బట్టెడు చేతితోఁ బట్టుకవచ్చి నా
తోడికోడలుమీద దూర్చిపోతె
నదిగని మాయత్త యాబిడదొంగని
కొడుకుతో నేరంబుఁ గుదురఁ జెప్పె

గీ. నాతఁడాపడుచేడువ నాకు త్రాటఁ
గంబమునఁ గట్టి సెలగోల గదిమికొట్టె
బ్రతుకు సందియమటఁ గూలెఁ బడఁతివచ్చి
చూచి మాకిది త్రోవని చూపవమ్మ. ౪౬

గీ. కొడుకుమూలానఁ బగలోనఁ గూడుమనకుఁ
బిన్నకోడలు కడనుండ బెట్టుజరిగి
యంటఁబో ముట్టరాదన్నఁ గొంటెవాఁడు
ముట్టుచోటునఁ జేకట్టె మోపిచనియె. ౪౭

గీ. నామనుమరాలు నిద్దురచే మసలఁగ
దాని కురులకుఁ దలుపికీఁ దగ బిగించి
గిత్తరగఁదోలనీడ్చుక గిత్తజడుగ
మొత్తుకొనె నెట్టులో యిఁక ముదిత చెప్పుమ. ౪౮

ఉ. చుట్టమొకర్తు మమ్ముఁ గనుసొంపున వచ్చిన దాని పైటకొం
గట్టెబిగించి చేతఁ బొదమవ్వాలబాటున కంచునీడ్వ నా

చుట్టులనున్న చానలది చోద్యముగాఁ బరికించి నవ్వి చే
పట్టుసడల్ప నాపడఁతి బావిఁగూలె నికెట్టు లమ్మరో. ౪౯

ఉ. కోకసడల్చినా యనుచుఁగుగోడలు సందునఁ దానమాడఁగా
నేకడనుండియో మచటికేగి మఱుంగుగఁ గట్టుపుట్టముం
జేకొని పాముపామనుచుఁ జేరికఁగూసిన నెల్లవారలుం
రాకను నప్పడంతి వెలిరా నటులో వినఁజెప్పు మన్నవా.

కం. బొట్టిను జవ్వని గట్టిన
పుట్టములో తెచ్చివిడువఁ బోయిన యుళుకన్
ముట్టను తెమ్మని చన్నవఁ
బట్టెనేలంటి యిట్టి పనులొప్పులటే. ౫౧

ఉ. ముచ్చటమించిదొక్కటిదెవహాలుము సెప్పెదనంచుబూతులం
దిచ్చిన నాదుకోడలవి యెక్కడి సుద్దులు మానుమన్నన
గిచ్చితి వీడ నిద్దురవఁ గేరడమాయని మోవినొక్కి వే
యిచ్చను వచ్చినట్లు రికె నెక్కువలే యిటువంటి చైదముల్.

ఉ. చిన్నది నీదుబిడ్డ పలుచిక్కుల మాటలనేర్చినాఁడు మా
కన్నియ కెన్నడోవలచి కట్టితి నోలి యదైవనిమ్ము గా
దన్నను దానిమ్మటల యాటకుఁ గాదనెదేని నీవర
మ్మన్నవ యేలికాదనెనె నాగడ మాడిన నోర్చుటెట్టులే.

ఉ. పెట్టగ మేనిసొమ్ము కొలపెద్దతికంబును గూడు చీరలుం
దట్టముగా సిరిందనువు దయ్యాను కయ్యాను లాడవచ్చిన
న్నొట్టమెయుంచు నెంచెదవు గొప్పగఁగలినఁ గలుఁగాక నీ
పట్టిని వాడపైవిడచి బందుగు లవ్వడ లించెదే చెలీ. ౫౪

మ. అని పెక్కండ్రు నెలంతుకల్ చురుకుగా నాడంగఁ దా ముద్దు
పట్టినిఁ దిట్టక జెడ గొట్టఁగాక పనిబొట్టెక రట్టుగా నొక్క పె
ట్టున బిట్టల్లరి మాటలాడెదరు చుట్టుం జేరి మీవాడకై
చనుదే దెప్పుడు నీడ నాడుఁ గద రే చాల్జాలుఁ బొండిండ్లకున్.

సీ. మీయిండ్ల కరుదెంచి మిమ్మందఱ నలంపఁ
బసివాఁ డెఱుంగరే పడఁతులార
యిన్నిండ్ల కొక్కనాఁడే వచ్చెనని యందు
రిన్నిచోటుల కెట్టు లేగెఁ జెపుఁడ
యీపుట్టువునకు మాకీతఁ డెందఱు లేరు
చూచి యోరువలేరె సారిదిమీర
లాగడంబులు సేయు నంతటి యీడేది
సిగ్గేల గల్గదు లగ్గమీకు

గీ. వెన్నదొంగిలి తినెనని విసుకులేక
వదరెదరు వెన్నఁ దిన నీడ పాడిలేదె
పొసగ దేమాట కేమాట బోటులార
కూటివలు గట్టనేల పొండేటిజోలి. ౫౬

వ. అని వారలనందఱ నదలించి మొదలింటి సామియగు కొ
డుదుడుకుతనంబు లెఱుంగక యుండఁ గొండంబోలె బరువైన
బిడ్డని డించి కనుంగొనుచున్న యవ్వ యెదుట నాయయ్య
లయ్య యాపులించి నీల్గిన. ౫౭

మ. మొగమందమ్మకుఁ గానుపించె జగములేఁడేఁడు నాల్గున్నవను
త్తగరులాడలుఁ బల్లెవారు దెసలుం దండైన పెన్గొండలుం

సిగమిన్నయ్యెయుఁ బైఁడికొండవిడుదుల్ సీద్రంపుపెద్దల్వగ
ల్నగఁడు మ్నాన్నగు గాములున్ గలుగు పెన్ బ్రాఁకు
లొప్పదల్చెలయున్. ౫౮

వ. ఇవియన్నియుం జూచి. ౫౯

గీ. వెఱుగుఁ జెందిచూడ బరువైన కన్నులు
మూసి తన్నుమఱచె ముగుదతల్లి
యంత నోరుమూసె నయ్యబ్బి లేవయ్యెఁ
గానఁబడిన వెల్లఁ గలయుఁబోలె. ౬౦

చ. తెలివినిఁబొంది నిక్కముగ దేవుఁడుపావఁడుగాఁడువీఁడయో
తెలిసితి మాసియైనఁ గనఁదేటగ నెమ్మిగ మప్పళించినం
గలుగునె ముజ్జగంబులను గలెడు నిల్పుడులుం గదల్పుఁను
న్వెలుపల లోపలం గలుగు వేలుపుగా నితని న్దలంచితిన్.

కం. అనిబత్తి మీఁటి యొదుగుటఁ
గని తల్లికి మబ్బుగప్పఁ గాఁజేసిన దె
బ్బనఁ గొడుకయనుచు ముద్దులు
గొనియె నిదుర లేనికలలఁ గూరితిననుచున్. ౬౨

వ. అట్లుండఁ గొంతతడవునకు నాటలందిరిగి కూటికి తామఱ
చిన బిడ్డ నమ్మగొనిపోవ దిమ్మరుతఱి. ౬౩

కం. నిను వెతలఁ గుడుపఁదిరిగెడు
దుసె దారుల మంటిలోనఁ ద్రొక్కుడుఁబరువు
ల్జనకుండను బూనికచే
సి నటుల మనుమ్రింగుచుండెఁ జిన్నతనమునన్. ౬౪

చ. అదిగనియున్న యైనబలుఁ డర్మిలిఁ దల్లికిఁ దెల్పెఁ దమ్ముఁడా
చదరములోన నాఁడుకొను సంగడిపారలు నేను వద్దన
న్గాదువక మంటిపెల్లఁ గొని గోరులగీరుచు బెల్లవచ్చుఁబో
లిదియని మ్రిమిం గెఁగంటినసనెక్కెఁ గఁ రోసముడాసియిట్లనున్

కం. అన్నా మన్నేటికి నీ
కున్నవి చక్కెరల మాటలొప్పుగఁ దినఁగాఁ
జన్నేయిటు కడుపంటును
తిన్నన్నల కరుగ కమరు తెగుళులు తండ్రీ. ౬౬

సీ. వలదన్న నీటిలో వదలక తిరిగెద
వలసటుఁ బడి యెత్తె దలమిగుండు
లోలి పల్లొత్తులనోపిక మనుబొందు
దర మానిసిని కంబమూపగలవె
చనువుమీరగ జేరి చరితేగ మడుకక
కొంచె మిమ్మనెదవు కొసరి మసరి
తండ్రి సెప్పినమాట తగునని తల్లినెం
చుడు వాడు జగడము ల్గదురగెలుతు

గీ. వలుకఁ గన్నమ్మ తోడుల యందుఁ జూపు
దడుగవిమ్మని మొలకుబట్టెనఁ దిరుగు
దాచకడతువు కూళలనంటి తుదకు
సిట్టి సీగుట్టెఱుంగ నే నెంతదాన. ౬౭

వ. అని విన్నాణంబునఁ దన్నుగుఱించి యాడు కన్నతల్లి సుద్దు
లాలకించి యొద్దిక నొద్దఁ జేరి యిట్లని బదులు మాటలాడ
నుంకించి. ౬౮

సీ. మనుఁదింటినని కానిమాట లన్నయ్యాడ
ఁని నమ్మితివె తల్లి విడువు నెపుడుఁ
దాఁదప్పు సేసి నాతప్పుగాఁ జెప్పి నాఁ
డాతఁడు మంటితో నాడెఁదోలుతఁ
దార్కాణగావింతుఁ దలవిప్పిచూడుము
మన్ను పుట్టలుగట్టె మాడునందు
నాదెసఁ దప్పైన నాఁడుమన్నించకు
మేనోరు దెరచెద నిపుడుసూడు

గీ. మనుచుఁ జూపినఁ దొలియట్ల నందుఁదోచె
నచ్చెరువు నంది యాబిడ యతని మొదటి
వేల్పు తనకూనయై పుట్టె వేఁడుకొందు
ననుచు మ్రొక్కులు సవరించి యాడుదానఁ
దెలిసె దేమియు ననుఁగడ తేర్పుమనియె. ౧౯

గీ. ఇటుల విన్నాణమున మించు నింతికపుడె
మది తిరుగఁబాఱ మైకంబు మాటుపఱిచె
నంత నాయమ్మ కొడుకు ముద్దాడి బిడ్డ
యిరుగు పొరుగుల కేగకు మేలతిరుగ. ౨౦

చ. పడుచులఁ బట్టినాఁడవని పాల్పెరుగుల్దిగ మ్రింగితంచుఁ బ
ల్దుడుకులు వల్కితీవనుచుఁ దూలఁగఁ జెప్పిరి వ్రేతలెల్ల నా
గడముల నెల్లమాని యిలుగాచుక యుండుము వాడ నిందలం
బడకుము గొప్పయున్నవల వాటిలు నబ్బునె దానభాగ్యముల్.

క. అని వినిచి చనియె మునికికిఁ
దనవలసిన యెడకు సాగి తడవాటలతోఁ
జనవలరఁ గూడి ప్రొద్దే
గినతఱి నిలుసీరనరిగెఁ గీల్కొను కడిమిన్. ౭౨

వ. అంత. ౭౩

చ. నెలతలు వాడలందిరుగ నేఁబడలించితి నంచుఁ గొండెము
ల్పలికిరి తల్లి మ్రోలఁ దోలుబాములఁ దామొనరింప గుంపులౌ
కొలలఁ దోలంగఁ జేయుటకుఁ గూరిమివచ్చుట నెంచరైరి వా
రలసట వేఁడుదాఁకఁ జననంచని వెన్నుఁడు వారానెఁ ద్రిప్పటల్

చ. వెనకటి కట్టులం జెఱచు వేగనులయ్యఁయనుంగుఁదమ్ముఁడా
పెనుపుల చేడెలం గలఁచు బిఱ్ఱునఁ బొమ్మని వాలుచెక్కెపుం
జనవరి కేపె జవ్వనులు జాలిని డీల్పడి నల్లనయ్య పొం
దనువెటు గాకయున్న వలపాపిరి లోపలఁ దల్లడింపుచున్.

సీ. మరికొంద ఱతివలు మలబిడ్డనోమినఁ
గోరికలన్నియుఁ గూర్చునను చుఁ
జందురు రిక్కచేజరుగు పున్నమ గల
నెలతొలి ప్రొద్దునవిందునీరు
జోకవారెను కఱివాఁక చెంగటఁ జేరి
రేవునఁ దమతమ పావడ లిడి
గట్టి సొందంబులఁ గఱివేల్పుఁ బలుమారు
నెచ్చరించుచుఁ గ్రుంకి యేటబారి

గీ. యిసుముచే నన్ని మేలుల యింతిఁ జేసి
తలఁపుఁ జెందింప సీతల్లి దగునని పది
యారుసంకెల యూడిగాల్వేరిచేసి
మ్రొక్కి కొల్చిరి మక్కువఁ జిక్కువారు. ౭౬

గీ. ప్రొద్దుప్రొద్దున నిటుల వ్రేబుడుత లచట
నోము నిండార నెలకడ కోమికమరఁ
జేయుచుండంగ నొకనాఁడు సిరిమగండు
కోరిక లొసంగ డెందఁబు కూరిమిదగ. ౭౭

ఉ. పోయి తనున్మదిన్దలచు బోటుల కోరికలిచ్చు పూన్కి తో
దోయము వారిఁగన్మొలపుత్తో నిలువుండని యానతిచ్చియా
చాయలసందుగొందులనుజప్పుడుమాయఁగ వేడ్కతోడఁదాఁ
బాయక చేరి యొద్దుపయి బంతిగనుంచిన కోకలన్నియున్.

కం. ఒకమాటగట్టి యప్పుడు
పకపకనగి చేడెలార బట్టలమాటం
దుకపొం డిచ్చెదనని ని
ల్వకచని యొక పొన్నమీఁద వైచె న్వడిగాన్. ౭౯

కం. అంతట నచ్చో నిల్వక
పంతంబున మ్రానికెగరి పచ్చని కొమ్మల్
క్రింతలఁ గప్పిన యురవుల
నెంతయు వగనుండె వారి యిచ్ఛందీర్పన్. ౮౦

వ. అప్పాపనిపాటి గనుంగొని యన్నగములు వెన్నదొంగా
చెంగున వచ్చి మామాసిన పుట్టంబులు జుట్టి పట్టి నెత్తిం

బెట్టితివి జాణవైనను మా వలువలీక పోకలం బోయిన
కేకవేయ వచ్చు పల్లెవారెల్ల మల్లడిగొని పట్టినెట్టుకొని
కొట్టితిట్టి మట్లాడుదు రిట్టి రట్టు లేల గుట్టుగాఁగట్టుపుట్టంబు
లిట్టిచ్చి యెందేనిజరుగుము. ౬౧

సీ. పుడమి విత్తనములు పోకుండ నిల్పుటో
పెద్దకొండల నెత్తు పెత్తనంబో
నేల క్రిందైపోవ నిలుఁ వంగఁ బట్టుటో
మానిసి సింగము న్మాటఁ గనుటో
తొలుత కొంచెముగాను దుది దొడ్డుచేయుటో
పసి తెక్కలి నడంపఁ బాటువడుటో
కడలి నెక్కుడు బల్మి కట్టఁ గల్పించుటో
యేరులు వ్రయ్యలై యెసఁగమనుటో

గీ. గోలవై రక్కసులమన్కిఁ గూలఁదనుటో
కలికితనమున మార్తుర గండడఁచుటో
కోకలెత్తుక పారుటగొప్ప కొంచె
మెఱుఁగుటేక నెన్నఁడయ్య మిన్నేటి జియ్య. ౬౨

కం. మీతలిదండ్రులు లెఱింగిన
రోత పనులఁ దిరిగెదనుచు రోయుదురింతే
తాతలు ముత్తాతలు నెను
గీతఁడు మాకొలముఁ జెఱుపనే మనెననరే. ౬౩

చ. వెలదుల యీలువ్రుల్గొనుట వెఱ్ఱిపిలాతఁడు కీడు వారివా
రలువిని యోర్వ రెత్తుదురు అంకెలజంకెలఁ బోరుసేయనీ

మలుపుకు సేఁతలంగనిన మన్ననసేయరు తోడిచుట్టము
ల్వేలవెలఁబోయె దప్పుడిది వేడబమా పడుచాటలొప్పునే.

ఉ॥ కూరిమి నీకువారమయి కూడుటకై సమకూర్పుమమ్మలన్
గోరికఁగాదె యేటిదటఁగూడిన చిక్కనిమంట యెట్టివా
పారువమెక్కిరింత చెలువమ్ముగ నర్మిలిఁజేసె డాసి జో
హారుల వేడుకొందుము దొరా కనరాదె యమద్దలంపుటల్.

చం. ఇటు లెటులాడిన న్వాలువలేని తలంపు లెఱింగి యింతుల
చ్చట గుమిరై నెగుల్వాడుచుఁ జన్గవ బంటగునీటి యీనువన్
బట పట పండ్లుపెన్నులివ్వు బాటుల నొక్కడఁజేరి చుట్టురాఁ
దుటుకుయి ముందుకర్జమెటు దోచకయుండిరి వెఱ్ఱులోయనన్

వ. ఇట్లుండి తమలోన. ౮౭

సీ. ప్రొద్దేగునందాక బోటి యిందేయుండి
చీకటిపడ నిండ్లఁజేరుదమె య
టంచోర్తువల్కిన నదిగాదు దొమ్మ్రిగా
జగడింప బెగడంది నడలు కోక
లని యొక యమ చెప్పెనది మెచ్చ కింకొక
పూబోణి గట్టువా పూని నవియె
మనమందఱము ఆల మాటి మాటికి ఉవ్వఁ
గ్రొవ్వాఱి యుఱుకు నాగుట్టెఱింగి

గీ. మనము పుట్టంబులందుక మఱలరాదె
యనుచు పలుమాంట లత్తరి నాడువారి

నాఁడు వారిఁ గనుంగొని యలఁతినవ్వు
మొలకలెత్త మొగంబునఁ బలికె శౌరి. ౧౧

సీ. ముగుద వెలఁదులార మోమోటమెడలిన
కతలేల పన్నెద రతకవట్టి
వేఁజెప్పు దిప్పాటి నింపగు మీమదిఁ
బరికింపుఁడు బిడెంబు పాదుకొలుప
నేల యింతకు ముందటే నగరాజతనుంటి
నెఱుఁగనివింత మీయెడలనద్ది
నోముపంటల మీకునే మాన కొసఁగుదుఁ
జేతులఁ బైకెత్తి చేరి నాఁడు

గీ. హాజ్జలంటిన వారికి నావటముగఁ
గట్టు పుట్టంబు లిచ్చుటేగాదు వార
లేతలంపున నోచిరో యెఱిఁగి దాని
మాన కొనగూర్చి పుట్టువు మఱలఁ జేతు. ౧౨

గీ. ఇవ్విధంబున నల్లయ్య యియ్యకొన్న
మాటఁ దెలబల్కఁ జిల్కలమాటకారు
లొక్కరొక్కరి మొగములు నొకరొకళ్లు
సూచి చిఱునవ్వు లొప్పార సొబగుమీర. ౨౦

చ. నిను మదిఁగోరి కూర్చుటకు నేర్పరిగా మలబిడ్డఁ గొల్చినా
మనుతలఁపబ్బె వచ్చితిట నాసలువండె బిరాన నీవు సె
ప్పినయటులన్నగించెద ముప్రేముడి నేలుము సామియంచుఁ జేఁ
జను మొనలాని యొక్క చెయిఁ జాపుచు గుట్టగుచోటు చాటుగాఁ

కం. నడచిరి పౌనఃపునికునకుం
దడుగున కొమ్మానియున్న యాల్గాపరి బి
డ్డడు సెలవిచ్చిన తెరవున
బడి బడి నగిశౌరి గొల్ల పడుచుల కనిమెక్.

వ. మచ్చికంటులారా వచ్చితిరే ముచ్చట పడితి నేన నిచ్చ
కంబు లేని సెలవిచ్చెదంగాని యిచ్చేరువ చేతులు రెండును
మూతులపై కెత్తి నెత్తిపై హత్తించి జోతలిడినంగాని మేలు
బొసగదని పసంగించిన నాసిబ్బెతలు గొబ్బునం బిడెంబు
లడంచుకొని యట్లనే మ్రొక్కుచు జానిసల యాసల
మోసపుచ్చక యిచ్చుతలంపు గీలింపుమని యొకరొక
రాడుచు నిక్కి నిలిచిన పక్కలెగర నవ్వుచు జవ్వనులారా
పుచ్చుకొనుం డిచ్చితి నని మూట నేల నాటం గాలం
దాటించిన. ౯౩

గీ. అంది పుచ్చుకొనిరి యప్పుడే ముదుపాపి
ముడి వదల్చి రొండి ముడికి దాల్చి
సంతసమున నిండ్ల జాడల నేగిరి
వెలదు లొకర కొకరు వెంబడించి. ౯౪

మ. వలపుల్మెండుగఁ బొల్లజేసి కొలబోవం గట్టులం దెంప జొ
బ్బిలు వేడ్కల్జను దెంచి కోకలకుగాఁ బెన్గాసితో వేడు చే
డెల మన్నించి యొసంగి పల్లియకు దండింబోయె రేద్రిమ్మరు
ల్కలనం దన్నెదురింప ముత్తినిడు వేడ్కన్గొల్వ లేకుండునే

గీ. తల్లి మ్రోల నిలిచి దండడి గిన్నె తె
బాలువోయు మనుచు బైటఁ బట్టె
గడుపు నిండఁబోయ గట్టుగట్టున ద్రేఁపి
పల్లెఁదిరిగె గొల్ల పిల్లవాఁడు. ౯౬

ఉ. అంతట నాల నేలుదొర యప్పిలగా డిలుబట్ట కాటలం
గంతులు వైచి కొంటెడను గత్తర వత్తిడిగా మెలంగుటల్
చెంతలవారు చెల్ప విని చేత చురుక్కనిపించ లేక ను
క్కంత నెగుల్లలంప విసుకెంతయు మానిన తాల్మికల్మిచేఁ.

ఉ. పాపడ నేటనుండి మన పాడిపసింగల మేఁత దూడల
న్జోపుచు సంగడీలు నినుజుట్టి సరిం బరతేరనంచు దా
దాఁపుగ దీసి చెప్పి సతదాటుల బెత్తము చద్ది చిక్కము
న్జేపడు కంచుకొమ్ము తొలి చెక్కడు పిల్లనగ్రోవు లిచ్చినన్.

వ. ఇయ్యకొని నల్లనయ్య. ౯౯

ఉ. ఆవలి రేపటిన్నరపు లన్నిటి రొప్పుగ రాముతోడ కె
మ్మోవిని పిల్లగ్రోవి దగ మోపి సుమాళముగాగ ఝాడుచు
న్నావుల నీడల న్బవలు మండెడు ప్రొద్దువెలుంగు వేదము
లోవగ నుండుచున్బలము పొంతల దూడల గాసె దిట్టయై

క. దొంగయై వ్రేపిల గాడుల
నెరతనములు దెలసి గొప్ప నెరపుచు వార
ల్వెరికికొని వచ్చి నెమ్ములు
పురులిచ్చిన నందికొనుచుఁ బొసఁగి పొలమునన్. ౧౦౧

వ. ఇట్లుండ. ౧౦౨

సీ. ఒకనాడు కంసుని యొప్పిదంబును గొని
మంద చేరువకొక్క మాసిదిండి
చనుదెంచె వాఁడొక సరిద్రొక్క గిట్టెలు
మలుగు మేల్తనము డాల్గులుకు మేను
చిఱుత యాంబరము మల్చినరీతి తొలిపండ్లు
నల మానికంబు లనంగదగిన
మెఱుఁగు కాటుకకండ్లు మిసమిస పసదూగు
ముట్టె యల్లలనాడు ముద్దుగంగ

గీ. డోలు గలిగిన దూడయై సోలి వ్రాలి
యఱ్ఱు పైకెత్తి నిల్చుచు నాడనాడ
గడ్డి పరకలు నములుచు గడిసి వేల
చిఱుతలం దన్ను దమ్ములఁ గరము వెదకె. ౧౦౩

వ. ఇట్లా చెడుగురాకాసి మిన్నతఱిగని మున్ని గొను పూనికఁ
గ్రేపుల దాపులం దోపిక దిరుగుట లరసి కరివేల్పు నల్ల
వలె దాల్చిన కాకల్లదెల్పి మెల్లన గనుచుండు మని యాన
తిచ్చి చని పోకవెంటనె జంటగా నంటి తిరిగి పెంటి
తరపు వంటి కెగరు నెపంబున నప్పాలసు దిండి వెనుకటి కా
ళ్లత నఱచేతంబట్టుతఱి నాదూడ గిట్టెల మొట్టున మిట్టిపడి
యాదిట్ట పొట్ట కావరం బామట్టుదుగాక నెట్టుకొని
యిట్టట్టు బోవనిత్తునే జత్తువుగాక యని యత్తఱి గత్తులం
బోని బెరడులం జొత్తిల్లు వెలగ సాలగకుండ మొత్తి త్రేడు
కాలిదుగచే గిలించి నేలవిసరి కొట్టెన. ౧౦౪

శా. వాతన్నూర్కొన నెత్తురు ల్దొరుగ గోవాడాడనే గూలియు
  ఙ్బ్రాతల్మిన్కొటమైన మేనినడుమం దొప్పారు నిండూపి రెం
  తో తారననుపించె రక్కసి యొడల్గో)పాడి (వేపల్లె పె
  న్గోతిన్జేరి బిరగ్గి జూచిరట మొగ్గునగ్గుడు స్త్రీలగాఁ. ౧౦౫

మ. బిరుదా రక్కసివచ్చి కూలవెఱగుం బిత్తేగు డెందంబుల
  న్నిరుతల్దామును పల్లెజేరి వడకు న్జేడ్పాటుతో నిండ్లలో
  బరువు ల్సేయుచునున్న పిన్నలకు రోఛాగైన కాపక్కర
ల్వారుసం జిక్కని రాగిరేకులపయిం (వాయించి చేఁ గట్టుచుఁ

వ. ఆరేయి గడపి మఱునాడరమేనివాని పొడుపున లేచి నందు
నితోఁ గందులఁ గాపాడుటకిల వేలుపులం గొలుతుమే యని
  యాయెడ నోడబాటుమీఁద నట్లసేసి సంతసించి రవ్వల.

సీ. జతగాండ్రడు (పొద్దెక్క జాగుసేయకు మని
      బడిబడి వేగిరపాటు దెల్ప
  దూడల వెనువెంట దొడుకులు పర్వెత్తు
      పొందు ముంగల నని బోయ లఱువ
  చద్దిచిక్కము చేతిసరి గోల వడినిచ్చి
      నీడ(మాపుల నెండ నిల్వఁ డనఁగ
  పచ్చి కలంపులఁ బడి (కేపులేగ సం
      దడి మఱువకుఁ డని తాత దెలుప

గీ. పిల్లగ్రోవియు బెత్తంబు పెరుగు చద్ది
  వంటకమ్ముర్మారు గాయదొప్పలను మిపుల

జంకలఁ దవిల్చి బువనము ల్సాకెడి దొర
దూడగాపరియై యన్నతోడ వెడలె.    ౧౦౮

మ. అడవింజేరి చెలుల్దనుం దిరిగి రానాడాడ సయ్యాటల
న్వేడుకల్మీరకుల పొంతజేయు చిటులే వీదూడలం గూడి రం
డెడమైపోయినఁ గాన లేమనుచుఁ దోనే తెంచు చుట్టాలపి
ల్లడులందూర్పుచు జేరెఁగృష్ణుఁడాకపూలంగ్రాలుమావిన్వడిన్.

వ. చేరి వారితో నిట్లనియె.

మ. చెలులారా మనమీడ చల్దిగుడువ న్నిక్కంబులన్ డించిదూ
డల గుంపిక్కడ గూడదోలుదమె యొండన్నగ్గి నారన్న వా
రలు నల్లానని పల్లమందు నిలుపన్ రాగ్రేపులం దార్చి య
వ్వాలఁ జూడ న్బనుకొంగ యొక్కటెదురై వచ్చెన్నగమ్మండగన్

గీ. దానిఁగాంచి జళుకు దవిలి పిల్లలగుంపు
శౌరి మరుగుఁజేరి చాయఁజూపి
నోరుతాక చెప్ప తారుమారై బిగు
వెలమి తాపుకొల్పి యిట్టులనిరి.    ౧౧౨

కం. పెనుదయ్య మిదియె మ్రింగ
న్ననుదెంచెడిఁ గావుమనెడి సంగడి పడుచు
ల్దనుజూచి పలుక వెన్నుఁడు
గనుఁగొనెఁ దన కెదుర నడచు గద్దరి కొంగన్.    ౧౧౩

వ. అదియును.    ౧౧౪

ఉ. ఎక్కడి కంసుఁ డంప మొదటింగల నాడుల నెల్లరోసి యీ
చక్కని గొల్లఁ డెక్కుడయి చంపిన రక్కసిమూఁక ముచ్చట
ల్గ్రిక్కన వీనుల న్బడినఁ గాంచితి నీతఁడె ఱేని కంటు చా
నొక్కదు ముక్కు చేవనుచు నోరుసడల్పెదు కొంగ ముందు దాఁ

ఉ. డాసి యిటాడె శౌరి బకుఁడామెను పైకెగబట్టి ముక్కునం
రోసముమీర దృంతునని ఱొమ్మునబల్మిఁ గలంప వచ్చె దో
హాహో సరిపోయె నీ బ్రతుకు నొక్కట జెందుదు మీరివచ్చినం
బాసిన తావ్రదప్ప జరుపంగల వావుల గామమింతలోఁ.

గీ. అనుచు మాటలాడునట్టి యెడాట మం
దరిది కొంగయైన యట్టినల్ల
నాను మన్నపిల్లఁ డడ్డమే నాకని
మ్రింగనోరు దెఱచి నింగికెదుర. ౧౧౨

సీ. పైకెత్తి తెఱచిన బలువుముక్కు నిరుచేత
బట్టి పైదబ్బ వెన్మట్టజీల్చె
బిరుసు రెండవదబ్బ పిరుదంట దిగువకు
జీల్చిన పెళపెళ జీలిపడియె
నారక్కసుఁడు నిజమైన రూపునఁగూలఁ
బొలమెల్ల నెత్తురు బొరలిపాఱ
నదిగని జతపిల్లలందఱు వెఱగంది
వెన్నుని బొగడుచు వేగసరిగి

గీ. మందపట్టున గొల్లల కందఱకును
క్రందుగాఁ దెల్పి నవ్వుటాలొప్పందుపఱచి

విని పసులగాపరు లికేమి వినుదు మొక్కొ-
తోడు పడుసాగె నుప్పలుల్ తూకితూకి. ౧౧౮

కం. అని కడు దిగులుపడుచు మా
మనికింగల వేల్పు ప్రోవు మమ్మని చేతు
ల్జోనిపి తిగకంటివేలుపుఁ
దనియించిరి వేగడవల తానంబులచేన్. ౧౧౯

వ. అంత వారలు. ౧౨౦

ఉ. ప్రొద్దొక యేడుగా జరుపఁ బోయె నెలల్మఱికొన్ని యంతలో
ముద్దియ లెల్ల నిండ్లకడ మున్గు తమిన్సిరితేని మచ్చిక
న్నద్దుల నుగ్గడింపుచును జూపులు మాపటి లయ్యాడీ పవ
ల్ముద్దులు కొండరాలకడ మోవగి నెచ్చెలి కాంద్ర జేసెడిన్.

వ. అనుచుం దమలోఁదాము వ్రేతలందఱుం గూడుకొని

మ. చెలియా కృష్ణుఁడునిన్న రేయినను దా చెంగాలఁ దాబోవుచుం
దెలియం జాలక సైగయాట పడుచా తిట్టుంబడం గోరితే
పలువా పొమ్మనఁబోయె వెంటఁజనినన్ బైవచ్చి నాకోరిక
లొక్కలగా గూర్చిన సంతసింతపుడు నాకుం దోచదామొంగదే.

ఉ. ఏటికి దెల్లవాఱె పగలేటికి బమ్మ పొసంగ జేసెఁగొం
డాటము లింటమానునని డాయఁగఁజీరెద దూడకాపు దో
డ్పాటు బలుండు గాజనఁగఁ బంపెఁగదే చెలి నందుడిట్లు చే
డ్పాటులు తోడుతోఁగలిగె వందురుపూవిలుకాఁడొనర్చెడిన్.

మ. మగువా ముద్దిడరాద యంచు నెదురై మాటాడనా వైపుగా
కగుబో రాతిరి నాయదే నిజముగా నాసాసలం బ్రొద్దు గూ

కగ రా నాతని కడ్డమైనిలువ నాకన్నుంగవ న్గప్పె మా
పగు పెంజీకటి మేరజెప్పనని డాయంబోక బేలైతిగా

గీ. నాతి వెన్నుని మదిగోరు నాటనుండి
సిగ్గచటికేగనో నాదు చెట్ట బట్టి
యింటి కేతేర జెప్పాదు నిపుడు బోయి
పచ్చవలెదాల్పు దేకున్న బ్రతుకననుచు. ౧౨౫

చ. వలపెటులాగుఁ జెప్పఁగదె వాఁడిటురాఁడు పరుండ కంటికి
న్దొలకదు నిద్దురెవ్వరిని దోడ్కొని రా బతిమాలి పంపినన్
బిలుపున కేగి తామె తెరపింగని పొంది మదేమొ బొంకు
సుద్దులు దగఁ జెప్పిపోయెదరు దూరులకొప్పితినే నెపోయెదన్

చ. చిలుకల కూఁతల న్జెవులు చిల్లులు వోదొడఁగె న్మరుండు క
న్నుల గలయించు విల్గొని చనుంగవ దూర లకోర్రిగుచ్చుటన్
బలపల డెందమున్వ్రగిలె బాగెటులో సెలవియ్య వమ్మ నె
చ్చెలి యిలుచిచ్చు పెట్టి వడిజేరెద నల్ల నిసామిఁ జెంతకున్.

మ. ననునమ్మె న్మగనాలు లోదమిని యెన్నంజైనఁదావచ్చునో
యని యిక్కంగుయి వెట్టుచుంటి నిటులాహా రాఁడు పైపైని బో
యిన వారిం దనియించు గాననువిదా యందాక వేగింతు వేఁ
జని పొత్తుం దెద నింటివారడుగుచో చానా వినం జెప్పవే.

సీ. రాలుగరంగునే జాలి మాటాడిన
బతిమాల రాఁడేటి పాపఁడమ్మ
వలపూనకున్న నాడిఁలు చుట్టు దిరుగువాఁ
డమ్మరమ్మగ వేఁడ నోరియుడేమొ

కట్టుపుట్టం బంటుగా నాసఁగొనువాఁడు
వలువ పైదీసినఁ గలియఁడేమొ
కనుసన్న లెచ్చోటఁ గదిసినఁ జెయువాఁ
డెటు చన్న నటుఁజేర నేమి యనఁడె

గీ. పలుకకుండంగఁ దప్పేమొ బాసదప్పి
నడువ నేమన్న కంటుగా నుడువ పడఁతి
కాఁపురంబులు సడలించి గాలుపుచ్చి
వలపు కడలి మునింగింప వలచినేమొ. ౧౩౦

మ. అనియాజవ్వనులించువిల్లలుగువాఁడాయుమ్ములందమ్ములం
జొనుపం దాళగలేక నొక్కరొకరిం జోకార్చుచుం దమ్మజెం
దిన కాకారదు వల్పు వేఁకి యుడికెం దేఁబోక రమ్మాచు నా
డిన మాటల్చెవిదార్చి వారలను గూడెఁ జాణఁడారేలఁదాఁ. 

గీ. ఇటుల వలపు నెరపు నింతులఁ దనియించి
కడకు తనదు టెంకిఁ గనుటఁ దెల్పె
నెట్టులైనఁ దలఁపు నెప్పుడు నిలిపిన
వార లతని యిరవుఁ జేరు టరుదె. ౧౩౨

వ. ఇట్లా మొదలింటివేల్పు మాలిమింజిక్కి మగువలు రేబగళ్లఁ
దాకు తప్పాలెయుంగక పొదలు తమకంబున నుండ. ౧౩౩

కం. వింతగఁ గనుపించె దెసల్
వంతల బడు టరసి వాగువంతలు బొలము
ల్సంతసిల వానకంటువ
దొంతరలై కొంగ గములు దూకొనె గాబుల్. ౧౩౪

గీ. తలఁపుపేకి కొలన బాగుదమీ నాల్గు
నెలలటంచు నేగె నెమ్మి మూవు
మన్న మున్న కొంచ మలకమర్చిన తూటు
నంచ పిండుతెవులు లంటు టుడిగె. ౧౩౫

శా. కప్పల్పందులు దున్న లేనుఁగులు మూాకల్గట్టి సీరానఁదో
ల్తిప్పల్మప్పలు వీఁగి పెద్దయెలుఁగుం దిప్పొప్పఁగాఁ జేయుచు
న్వొప్పజ్లొప్పడు గొంకులేక తిరిగె న్వేనల్లగోతు ల్వురు
ల్వ్యాప్పం బారఁగ వేచినట్టి వపసల్వికాకాడె నాఁడుబ్బుతోఁ.

సీ. ససిపొలంబుల నెల్లజాపెక్క కనుపట్టె
మెఱుపులుడాకడ మెఱువఁబట్టెఁ
బల్లలంబులను వానపాములు మెలిబెట్టెఁ
నెఱ్ఱని పురుపు లెల్లెడలఁ బుట్టె
నేనుంగు లందుగుమూఁవి కొమ్మల మట్టె
మబ్బులు చెదలంటి మసలిచుట్టె
జుట్టుపిట్టలు నట్టు పట్టులఁబురివెట్టె
నుఱుము లంచలగమిఁ దఱిమికొట్టె

గీ. నీటివరదలు మెట్టల నేటిపట్టు
లొక్క చదరంబుగాఁ దోవ లొడుగదొట్టె
వానసరిసాటి జగమున వాడనేది
కాన లెల్లను గపవబ్బి కానఁబడుటం. ౧౩౬

కం. ఎద్దుల కూాబరములు నలు
పద్దించినరీతిఁ గప్పలలవడెఁ బొదుగు

దిద్దిన పెద్దటికలవలె
పొద్దే పాల్గారుచుండెఁ బోలపావులకున్. ౧౩౮

కం. ఏరులు సందీకెప్పుడు
జారుటఁ గనవొప్పెనట్టి పట్టులఁ బచ్చ
ల్బారె జిగిపంట వెలఁదుక
పేరురమున్ర వాలు పచ్చపేరులొ యనఁగన్. ౧౩౯

వ. ఇట్లొప్పు వానకండువందంబైన లేతగడ్డి మేసి బలుపందిన గిడ్డల దొడ్డులం జేరిన జడ్డుదేర బురదల నిదురింప వని చదరంబులగు వల్లెపరగటి మెట్టల నిలువందోలి కాపాడుచుండఁ గండక్రొవ్వు నివ్వటిలు మానిసిబువ్వ యొకమిండొక్కరుండు కంసుని పంపున పిల్లల నెల్లయెడల దుల్లంజేసి వచ్చెదనని మచ్చరంబున గచ్చులాడిన వాఁడగుట నెల్లకడలం దిరిగితిరిగి పిల్లల దుల్లంజేయుచుం జనుదెంచి యీపల్లెదాపు వారగు కోపుగల మానిసి మేపులొక పాపనితో నోపలేక మడియుటలు విని దిటమరితనంబునం జేరి. ౧౪౦

సీ. నేలఁగాల్రాటించి నింగికి బర్వైన
దువ్వచీకటి గుంపు తోడుసూపఁ
గొమ్ముల దిబ్బలు గోరాడు విసరున
నెగరుగడ్డల గాము లెల్లఁదూల
ముట్టెత్తొపునఁ బల్లె మొనయు సావడిగోడ
లడుగులు బెకలి సందడిగ నురులఁ

బారలెగ దొట్టిన మిఱుమిట్లు గొను కనుఁ
గొనల నిప్పులవాన గురియు చుండ

గీ. దోక త్రిప్పులఁ బుట్టిన దుడుకుగాలి
చేరువల నేలపుట్టల వేరులవియ
గబ్బి ఱంకెల సవ్వడి గాబులెగిరి
చెదరి వాపోవఁ దెఱవలు చిడిముడిపడ. ౧౪౧

గీ. మంద గొందల నుందించు మట్టగిత్త
పరువు లెత్తుటఁ గన్గొని బ్రతుకుఁగాన
కంగలార్చుచుఁ బల్లెవా రాపలేక
బెదరి నల్గడఁ బరచిరి బీతువాడమి. ౧౪౨

క. ఆయడరునఁ దనునమ్మిన
బోయల కగచాట్లుదెచ్చెఁ బో పాడెద్దీ
రాయిడి మానన్దీని
న్మాయించెద ననుచు లేచె మగఁటిమి హలిదాన్. ౧౪౩

గీ. ఎదురనిలచి తాటోటుతో నింతబలిమిఁ
బోరెదవొ రారయని పిల్వ మొఱకుమడియ
బింకమున మీఁదికఱ్ఱత్తి పేరెమెత్త
గిత్తరాకాసి నుదుటఁ గాలెత్తి మొత్తె. ౧౪౪

శా. ఆకాల్తాఁకున మాడుపట్టదర వాఁడల్లాడుచు న్వ్రన్క నొ
మీఁకాల్లోకసమంటఁబో నెగరి చిమ్మెన్నెమ్మ దమ్మొంపఁగాఁ
జీకాకై మునుద్రెళ్లెఁ దెల్వి వోడమం జిత్తాడుచున్నీఁద రా
నీకుంజావొనఁగూడెనింకెచటఁ బోనేర్తుం చుఁగుప్పించి తాఁ

ఉ. కొమ్ములు రెండును న్మెలచి గూడల పట్టెగు వంగఁ ద్రిప్పి నం
గ్రుమ్మరి వెన్బ గుల్కొనుచు గొబ్బున నెత్తురు దాఁ సోలె తే
లెమ్మని వెన్నుఁ డుద్దవిడి లెప్పనఁ బైఁబడి తన్ని యీడ్వ ని
క్కమ్మగు మేన గిబ్బ పొడగన్పడ కప్పడె చచ్చె వాఁడొగిన్.

ఉ పల్లియ వారు వచ్చిరని పాపసిచే బడిపోయె వీడు మ
మ్మెల్లఁ గలంప వచ్చియని యేర్పడఁ బల్కుచు గొప్పగుంటలో
మెల్లనడించి పైనిడిరి మిక్కుటమై తగుచాపురాళ్లు మే
నెల్లెడఁ గానరాక చటనే చివుకం గసితూగు బాటుగన్.

గీ. వాఁడు మడియుటయును వడిగల తనయన్న
కొంగ దాల్పుముందె గూలుటయును
విని యఘాసురుండు విరివి పామిది యనఁ
బండియుండె దూడ పదుప్రతోవ. ౧౭౮

వ. అట్టియెడ. ౧౭౯

ఉ. పిచ్చుక కుంటి పెన్బొడవు పేరిమి గుబ్బలమీద హత్తిరాఁ
గుచ్చెల లంటదోపి తమకుం గల పాడిపెరుంగు జవ్వను
ద్రిచ్చుచునుండ నల్లఁడెడదం దలపోసె బిరాన దూడలం
బచ్చిక మేపఁ దానరిగి పాముగు రక్కసుఁ గూల్తునంచొగిన్.

చ. అది దన డొందమం దిముడ నాతఁడు సంగడి వారిబోరి లే
గదుపులఁ బెండలాడి గొని కావఁగ నేగుద మన్న వారుమం
చిదియని పైనమై వెడలఁ జేకరపిల్లన గ్రోవి కల్పుచే
మెదపిన చద్దికొమ్ముగొని మెల్లన దూడల దోలెఁ గానలన్

మ. తలపై నెమ్మి పురింబిగించి మొలచెంతం బట్టు చెంగావిజు
ల్లుల వల్లెంబిగజుట్టి కారడవి పూలుఁ జేజిగుల్లొంచి మొ
ల్లలతోఁ జేసిన దండలల్లుబడి వ్రేలఁ వేల చిన్నప్పలా
గులుకుల్పెయ్యాలుమెచ్చిరాఁదిరిగెముంగోలైయనుంగంటిరాఁ

సీ. ఒక చిన్నపాపఁడు నొక చెట్టుఁ బట్టిరా
నీటుగాఁ గొంతసే పాటలాడి
పడుచు గొల్లల మెడబట్టి యెక్కొంతసే
పుయ్యాలపై నట్టు లూగులాడి
చెంగట బంతులం జేనాడు పిల్లల
పెన్నుద్ది నని సరి పెనుగులాడి
యొకఁడు పిల్లనగ్రోవి నూదినఁ దానేగి
తానకంబుల మెట్టు లానిసోలి

గీ. కొంద ఱెదురైనఁ బైకెత్తి కూలఁద్రోచి
పడిన నొచ్చెనె యని మేను బట్టిపిసికి
యడవిలోఁ బొద్దుపోకకై యచ్చటచట
ననముగాని పను ల్సేయు టగుదొనర్పె. ౧౫౧

సీ. ముందఱ నిలిచిన న్మొట్టకుండిన మీఁకు
ముట్టినఁ బరువెత్తి మ్రొగ్గువారు
తలపాగఁ గొని చెట్టుతలమీఁద వైచిన
దెచ్చుకోలేక పైవచ్చువారు
చల్ది చిక్కము మ్రోవఁ జాలవు తెమ్మని
కలవంటకము దిని సొలయువారు.

సెలగోల యందిమ్మ వలబోద మపవంగ
నడుమెక్కి పడఁ ద్రోయ నలుగువారు

గీ. కోడిగంబులు వల్కుచుఁ గోకమొలది
పడ్డఁ బరువెత్తి దిసులయి పదరువారు
నగుచు నాల్గాపు బిడ్డలు నలమటింప
నిండ్ల కడఁజెప్ప వద్దప యెలమి వేడు. ౧౫౪

వ. ఇట్లా పులుఁగుబాబాసామి మొదవుల నేలువారి బిడ్డలతోఁ గొంత సేపు సయ్యాటల విరాళించి వారలుం దాను మఱియును, ౧౫౫

శా. పూఁగాయల్పడ రాల్పుచుం బులుగులంబోనీక బిట్టాపుచు
స్రిగ్జల్పటిన పెన్పుదల్మిలిచి వెల్లిన్ద్రోపగాఁ దెంచుచున్
వాగుల్వంతలు వూష్పుచున్మలపి సివ్వంగుల్పులుల్దుప్పులు
న్డాగన్జొడమీఁక మూకలయి కానల్కొనలత్తాడుచున్.

గీ. కుఱ్ఱలును దాను నిటులాడుకొనుచునుండ
రెండు జాలయ్యె నది సిరితేఁడెఱింగి
తోడివారలతోనముఁ దూలెఁబ్రొద్దు
చల్ది మెక్కెదమే చెట్లచాటు కరిగి. ౧౫౬

వ. మఱియును,

సీ. మేలైన చివరల మేలందికగుదాని
నాకులఁ దపసుల నాగుదాని
నలువంక గొమ్మలఁ జెలువమయ్యెడుదాని
నూడల పావరా నెరయుదానిఁ

బలువన్నె పులుగుల బందిసందడిగాని
వేవేలుంగులు జొరవెఱచుదాని
బండిగుర్రాంద పెన్పెందిరల్దగుదాని
గొప్ప పాముల తొట్టులొప్పుదాని

గీ. గాంచితిరె పిల్లలార మీకన్నులలర
మఱ్ఱిమ్రానిది యీనీడ మనము జేరి
పగటి బువ్వాలు మెక్కి యీపైన వలచు
త్రోవఁ జనుదము దూడలఁ దోలుకొనుచు. ౧౫౬

వ. అనుటయు

శా. ఆమాటల్విని దూడకాపరులు తెంపైపోయె దూడల్గటా
జామీడం గలవంటకంబు దిననేచాయన్వెస బోవునో
మామా లేగలఁగొంచువచ్చి కుడువన్మంచయ్యెడింగాదె నా
మీమాటల్గొరగావు దూడలను నెమ్మిన్దెత్తు బోసేయుఁడా

గీ. అనుచు మఱ్ఱికొమ్మనటువంచి చివ్వున
నెగిరి దానిమీఁద నిమిడిచూచి
తలపు లవియె యేటిదండ కయ్యలలోన
మేయుచున్నవసిన మేలె యనుచు. ౧౬౨

కం॥ చిక్కములు విడిచి గొంగడి
కొక్కెరలు సడల్చి చెట్టుకొమ్మలఁ బీట
లెక్కొలుపుకొనుచు సందడిఁ
జక్కడితఱి ద్రాచుపాము చెను రొదసేసెన్. ౧౬౩

గీ. ఆలకాపరిబొట్టె లట్లాలకించి
యేమి యుప్పలిగలిగెనో యెట్టులో కొ
యనుచుఁ బరికింపఁ గనుపించె నపుడు పెద్ద
కానరానికాళ్ళది దిగుల్గొమ్మకొనఁగ. ౧౩౪

వ. అప్పు డప్పిల్లగుం పల్లన నల్లనయ్యతోడ. ౧౩౫

కం. పెంజరవొక్కటి మనలం
గొంజక దిగ్రమింగ వెడలె గోడేర్పడ లా
వుం జేవగల్గు దీనిం
గెంజాయం గంటుఁగూర్చి గెడపుముసామీ. ౧౩౬

మ. బుసనేదాళముగావిమర్చుసెకలంబూ నారిపోనయ్యోడు
న్వసగాదేటికి దీనినాప ననుచుజా వ్రాకుచ్చినన్వచ్చి న
ల్దెసలంజూచి పరున్న పెద్దచిలువం దేవుళ్ళపెన్బ్రాపువె
క్కసమొప్పం గని పిల్లలార వినుఁ డేఁగగ్లి న్వగల్పుట్టునే.

కం. అని యూరడించి పజ్జకుఁ
జనువాఁడై ధట్టిజుట్టి సరిబేరెముతోఁ
బెనుబాముం డగ్గరె న
చ్చెనటి న్బరిమార్పనరిదె సెత్రియతనికిఁ. ౧౩౭

సీ. కళుకునలుపురాలఁ గసిదీర్చు కన్గవ
జగజంపుగొడుగుల సరి పడగలుఁ
దలపూనికపువన్నె మలయు తిన్నని మిట్టె
కనరాక కడుపంటు గడుసుకాళ్ళుఁ

బలవెండ్రుకలతోన వసమించు నిమ్మను
కఱకు ఱంపము లెనగాంచు కోర
లలచాలు దెగడు చాపలవడు పెందోక
కడిది జిల్గొప్పారు కత్తళంబుఁ

గీ. గలిగి తనదాపు సీర నొక్కరునిదోలఁగి
యుపలఁబోకుండ మింగెడు నట్టినోరు
దెఱచికొనియున్న పెనుబాము దెవులకుండఁ
గాల ముఖమ్మా రెగసి తన్న కళవళించి. ౧౭౦

మ. పిలగా తన్నదవేల నీకు బ్రతుక న్వి న్నొద్దులే దిప్పడే
నలుక త్రిమ్మంగెదనంచుఁ బైకెగరి పిల్లాతండ్రి నెక్కొమ్మడి
న్దొలిగ్రుక్కన్గొని వెన్నుని న్మసవఁగాఁ దోరంపునోరెత్తినా
ల్కల మే నాకి గబుక్కున న్గుటకదాక న్జొన్ప నాతండొగిన్.

గీ. తనదుమేను సందు దగులకుండఁగఁ బెంచి
యూరు పాఁగ మిద్దె యో యనంగ
వెలుఁగఁ దల్లడిల్లి విరవిరబొరలిన
వదలఁడయ్యె గుడుసువాలు వేల్పు ౧౭౧

కం. గొంతాగినఁ బంతముసెడి
గంతుగొనియెఁ జిల్వ జేఁడు గడకం బిలగాం
డ్రెంతయు వేడుక వెల్వడి
బొంతలు పై కెగరవైచి పొరిఁబొరి నగుచున్. ౧౭౨

వ. వెలిఁజేరి యొకరితో నొకరు. ౧౭౩

ఉ. ముప్పుగ చేసుకోర లర మోపిన నీల్గుచు రెల్ల వారు న
న్నిప్పుడ మిన్నుడల్పురుప నెంచుల నెవ్వరిఁగాన నంచు ముం
దిప్పెను ఛాము వాతఁబడియె న్గద పౌన్వలువయ్యగారిచేఁ
దప్పుచుఁగావు బీరమున దయ్యములన్నొగిలింప బోయినన్.

గీ. వానికడుపుఁజొచ్చి ప్రచ్చి కండలు ద్రెంచి
వరదనెత్తురచట వాఁగుబాఱఁ
జేసి వచ్చి తోడిచెలులలో నొక్కఁడై
వలికెఁ దేనెలొలుకఁ బక్కిడాలు. ౧౭౫

కం. ఆకటఁ బడితిరి యలసట
దేకువ సెడ జాగు లేల తెచ్చినచద్దు
ల్మూకగఁ జుట్టుం బంతిగ
నాకడ మెక్కుఁడని నడుమునం దా విడిసెన్. ౧౭౬

మ. నడుచక్కిన్దగు తన్నుఁజుట్టుకొని బోనంబప్పుడే గొప్ప వి
ప్పుచుఁ బూమోవుగుపంచుటాకులపయిం బాలొప్పఁగా నుంచి వే
పడుచు న్లేచుచు నారగించిరి చవుల్వొట్టిల్లు పచ్చళ్ళ పొం
గుచుబూరెల్వారుగుల్నెయియున్వడయు నాకుంగూరలప్పాలతోన్

సీ. ఒకఁడు ముచ్చటనుండ నొకఁడు మేలిమిహార
లందిపుచ్చుక మ్రింగి యవలికేగు
నావపచ్చడి మంచిదానా యని యొకండు
మిడుక నెత్తుకపారు మిడిసియొక్కఁ
డూరుదబ్బలు నంజుచుండ నొక్కఁడు నందు
గని యొక్కరుఁడు దిను గారెలెలమి

కడినీగజతికె నేగనితీతుఁ దెమ్మని
యొకరు డొక్కనిముద్ద నొడిసి నములు

గీ. నిటుల సయ్యాటలాడుచు నీటుమెరయ
బంతు లేరపడఁ జల్దులు వింతవింత
రుచులఁ దెల్పుచుఁ గుడిచెడి రూపు దెలిసి
పళ్ళె నల్లప్ప డప్పిల్ల బంతితోడ. ౧౨౮

ఉ. దూడలజాడ నేడరసి తోలుకవచ్చెద నింద యుండుఁ డం
చాడి వడి న్నడల్వెదకునప్పుడు తామరచూలి గొల్లడఁ
న్వేడబమూని పాల్వెరుగు వెన్నలు దొంగిలి మెక్కి క్రొవ్వినా
డీడుకురాని సేఁతలకు నెల్లను దానని వెంబడించుచున్.

చ. తడవటినుంచి పెన్పలిమి దాలుప నామొన కెక్కు పూతన
న్నడపె మొగుళ్ళ క్రోవలను గిట్టు నెగుల్వ చరించు బండి కా
ల్కడకొన వ్రేలదా చెఁబడఁగా సుడిగాలిగ మాసి నెత్తు రా
నుచుఁబయి కెత్తఁ జంపెఁబడనూఁకె జతందగుమద్ది మ్రాఁకులన్

సీ. దూడయైవచ్చిన తులువ నుక్కటుఁగూల్చెఁ
గొంగయైవచ్చినఁ గూల్చె బకునిఁ
బాముయి పైఁబడ్డ పగతు పొట్టఁ బగిల్చె
బసవఁడై రక్కసిఁ బట్టి మొదిపె
నాలగాపరి జవరాండ్రఁ జిక్కులు వెట్టి
పాల్వెన్నఁ దిని దొంగపనులొనర్చె
వ్రేఁతలపుట్టము ల్వ్రేత బెట్టి కడకిచ్చె
నోరఁ జగంబుల నోలి జూపెఁ

గీ. దల్లి బెదరించి త్రోలఁ బెద్దార్చిటఁగట్టఁ
దాఁపుఁదరలంగ నీడిచెఁ దలఁగఁ జెందు
పితనిబలుపోక లెట్టివో యెఱుఁగఁవలయు
నని నలువ యాలదూడల నపుడు దాఁచె. ౧౮౧

వ. అంత కృష్ణుండు.

గీ. వెదకి వెదకి దూడకోదములఁ గానక
తిరిగివచ్చి కూడుదిన్న చోట
పిల్లగాండ్రఁ జూడ బిరబిర రా వారి
దాఁ దెఁ బాత కొండ దండఁగవిని. ౧౮౩

కం. అక్కడ పిల్లలఁ గానక
సొక్కుచుఁ గేకలిడి పిలచి సొరియ లరసి యే
నక్కనగానక చెసిసెఁ
బొక్కిలి బిడ్డపనులాట పొంగుదు మదితోఁ. ౧౮౪

శా. నన్నా మైదునముంపఁ జూచె జగముల్నా మాయలో జిక్కెను
ద్దన్నున్నా నెఱుఁగంగ లేకుడుగుట ల్దా జూడ లేదేమొ కా
నన్నం బీపని మాన్పు టెంత దెలియన్ జాలండు నాబిడ్డఁ డే
మన్నం గాదు నలంగి యోటువడి నేమంబీవ తా వచ్చెడిన్.

గీ. మొదటి పుడమిగోడవ వదలింపుమని వేడ
నీడబుట్టుమనుట లెల్లమఱచె
మఱుపు దెలుప నేల మసలినఁ దనుదాన
తెలుపుకొనునటంచు దిటముతోడ. ౧౮౬

క. పల్లెకుఁజని యాగొల్లలు
తల్లడపడఁ బిల్లగుంపు తడసి రడవిలో
నెల్లి సని వెదకుఁడన వా
రెల్ల దిగుల్గొంద నేల యిపుడె కుమురుతుఁ. ౧౮౭

వ. అని తలపోఁతలఁ బడుచు నచ్చియుత దచ్చివేసంపు సామి
యప్పసిపాపల ముక్కు చెక్కు డొక్క పక్క లెట్లెట్టులు
తొల్లి నట్టట్టచ్చొత్తిన యట్లు గానరామి యట్లనె తలుపుల
రూపులుం దానయగుచు మందల కరుదెంచి యెదురుగా
నాగిన గిడ్డలు తమ బిడ్డల ముందలును నట్లలమికొనుటఁ
జూచి (వ్రేతలు నీ తెఱంగున నామఱుంగు నెఱుంగజాలరఁ
డెందంబున సంతసంబంది సాగుడుమూగి మును వారి
వారిండ్ల కడకేగిన నప్పుడే యెబిడ్డ లేయేపాలఁకువ మెలం
గుదు రామెలఁకువఁ దప్పకుండఁ దిరిగిన నాయువ్వ లెవ్వ
రీబూటకంబు నెఱపుట నేటికొనదాక జఱిగినం గనలేక
తమబిడ్డల కౌఁగలించిరి మఱియు నొక్కనాఁడడవి దూడ
లంగాచుచు ౧౮౮

కం. నాగేటివాలుదాలుపు
జాగేటికి తమ్ముగుఱ్ఱ సరిదెల్పుము ము
న్నాఁ గాపరిపిలగాడుల
వేఁగనులయ్యా జతలనుచు వేమరుఁ దలఁతుఁ. ౧౮౯

కం. (క్రేపులఁ బాపల తెగలని
రూపింపుదు నిప్పుడెల్లఱు న్నీవని నా

కీపగిదిఁ దోచు నిజ మిం
తే పనిఁ దెల్పుమనఁ దనకుఁ దెలదని నుడివెన్. ౧౯౦

శా. ఆమాట ల్వీనుసోకినంతటనె యన్నా తెల్పెద న్బ్రహ్మన
న్నాబుల్పెట్టఁదలంచి దూడ కడుపుం బాపల్లలిందూరక
క్రన్బామెన్వారల దేశమూని యిటుగాఁ బ్రేరేచితీయే డనన్
రాముండొప్పుచు సంతసించెఁ గలకారన్ద్రందమత్కారుఁడన్

వ. దూడలం బిల్లగాండ్లం దాఁ దాచిన వెరుకనడుచు రీతి నారసి
యా నలువయుఁ దనలో నిట్లనుకొనియె. ౧౯౧

సీ. తనుదాచు బొట్టెలు తఱుపులు గవినుండఁ
జూచి వెన్నునివెంట సొరిది దిరుగఁ
బిల్లలఁ గ్రేపుల పెల్లుబ్బ గన్గొని
బొమ్మ నేనొక్కఁడఁ బుట్టిరెచట
వీరని పెద్దగా విసివి లోవెలిఁజూడ
నంతటఁ దానయై యమరు టరసి
చిన్నబోయి యెటాడఁ దన్నుఁ దా మఱపొంది
యొక కొంతసేపటి కొయ్య దెలిసి

గీ. తండ్రి మతకరిసేతకై తలఁపు లోన
మెదల నాతఁడె యీతండు మెలపు లేక
తప్పఁజేసితి మన్నించు దారి నేరిఁ
గోరి కన్గొంటునని వెతఁ గూరిగూరి. ౧౯౩

కం. అడుగులఁబడి మొఱవెట్టక
కడు మన్నన వడయు తెఱవు గల్గద యొరుల

న్వేడగునయి చేరి కర్జము
విడుపొనరుపఁగలనె యతుడు నేగుపు లగునే. ౧౨౮

వ. అవి తలపోసి తన తెలివితక్కువకు రోసి, వెలిపిట్ట వారు
వంబుపై కెగరి వగర్చుచు మబ్బుదారింబడి గొబ్బునం జని
చని ప్రొద్దు బిడ్డ యొడ్డుబడి నిలిచి నివ్వెఱపడి నలువఁ
గనుచుండ. ౧౨౯

మ. గవిలో దాచిన దూడగుంపునిసుపుల్గారొక్కంచు నేతెంచినం
జవుకుల్ప్రామన్నొదలన్నియుఁగడచి యాలాన్లల్గప్పకేతెంచి ని
క్కువమా దూడల నెంతయున్నమిరి డొంకుల్లేకచవ్వాలు మ
క్కువతో నిచ్చెను బిల్లగుంపుఁగని బాగుల్మీరి రాల్గాపరుల్

చ. అది గని బమ్మదేవ రరుదంచుచుఁజూడఁగ గొల్లవారు పి
ల్లదుటుము దూడగుంపుఁ బదిలంబుగఁ గన్పడ నాల్గుచేతులం
గుడె సుడివాలు సంకులును గొమ్మగు సింగిణి పెద్దకత్తి క్రొ
వ్వేద సిరియుండ అందరకు నేర్పడ దయ్యముః పోలి కఁదగా౯.

సీ. వడిగని యబ్బురపడునంతలోపల
వారలు మాయమై వాస గురిసి
వెలిసిన కైవడి వినువాడ బయలైన
నాతండ్రి నన్నిట్లు నలుపద్రుఁచె
నిటుసేత తెలివబ్బె నింతయు మంచిగా
దలపోతు నేటికి కలకపడగ
కనికరంబునబిల్చి వని వినుమనుగాక
పడిలేవనని బత్తి పాదుకొల్పె

గీ. వెనుక బుట్టి పెఱిగినట్టి వింతలిచట
పనులు ముందఱ సవరింపఁ జాలుపడెను
కర్జములు లోనిచూపునఁ గాంచి మఱలఁ
గాంచెదవటంచు బృందఁ జక్కఁగఁ జేరి. ౧౯౮

సీ. బొడ్డానగట్టిన పొంబంచెఁగలవానిఁ
జెవినిఁ బిల్లనగ్రోవిఁ జేర్చువానిఁ
బిల్లలు దూడలు నెల్లఁదానగువానిఁ
బృందయందు కానఁ బెంపెక్కువానిఁ
గన్నులీకలఁ దలకట్టుఁ బెట్టినవాని
నఱుతఁ బూదండల నమరువాని
యాలగాపరుల నయ్యాటల నాదగువాని
దురుసు రక్కసిగుంపుఁ ద్రుంచువాని

గీ. నవ్వుమొగమువాని వాతులసిగ్గులు
కాలలాడువాని గొల్లవాని
బొల్లిమోర పక్కఁబూను మేనలవాని
దాత గాంచెఁ గన్నుదమ్మి లలర. ౧౯౯

చ. కనుగొని యంచనిల్పి తన కావరమేగుట కంజలంటి మ్రొ
క్కనఁ దనుజూడకున్నఁ దమకింపక వేబదినూరుమారు లొ
య్యనవలత్రిప్పుటన్బదుచునాడుచుఁ దొల్లిటిమాటలొక్కొకటం
దనదగు బత్తిపేర్మి గుఱిదప్పక సాగిలుచుండె మాటికిన్.

కం. తెలియక తప్పొనరించితిఁ
బిలగాడుల దూడకదుపుఁ బెరచోనిడితి

న్బలియుఁడవుగాన నన్నియుఁ
దలపోయఁగ నీవయైతి తరమే పొగడన్. ౨౦౧

కం. జగములు నాచేఁ గలిగిన
వగునని గరువంబు నొంది తెక్కబంట నా
పాకరణఁగ నీకు బిడ్డఁడఁ
బగవాఁడనె మనుపుమనిన బరువే కావన్. ౨౦౨

గీ. నేల తనుమోచువారలు గూలఁబడుచు
బరువుమోవంగజాల మన్నలుకుఁ దెలిసి
నాయెదుటఁ బల్కు మిము నేఁడినాఁడ దానఁ
బుట్టితివి పల్లె గడసుల పొడవడంప. ౨౦౩

ఉ. ఈకతలెల్లనున్మదికి నెక్కియు నీవొక పిన్నపాప వ
న్నోకనుబోయి మోసమును బొందఁగలావను వెఱ్ఱిదోచి నే
నీకడ నగ్గుజేసి తిదియెంతయుఁ దప్పు మలంచి ప్రోవుమో
సాకుడుతండ్రి వేఱ దలచంగలరే సినుఁబోలు వేలుపుల్.

వ. అని విన్నవించిన న్గుయి వినన ట్లుండ మఱియును, ౨౦౪

యగణదండకం.—— సిరింరొమ్మునందుంచి చెన్నొందు సామీ
పరాకా చిరాకేల నయ్యాల నేల్వారిలో నేనొకండంచు
మన్నించరాదా దొరా సాకలేవా మొదల్నీవకా యిచ్చ
గల్పింప నీవింతయుంబూన నీయాన నిన్నంటి వేగంటి పె
న్నత్తిదాఁ గ్రొత్తగ్రొత్తనట్టుల్గాజగంబు న్దగం జేయదానిన్మ
నంజేయు బల్యూ్వనిక న్నీవె నీయంతట న్వాల్గు రూపైయెడ

గ్గలు హాసిందోడించేరి యాడి-తుపీజాడ సగ్నూడగా లేదు
గెంజాయులా పెంజడల్ మించు పెద్దలదా కాంతురెప్ప
ట్టునం గట్టుగాఁ బొట్టలోఁ జూడి హాబోటి వేసూటితొల్లింటి
చందంబునం దేర్పడంగం గురయ్యా దగుల్మోలు లియ్యంగ
నీవెయ్య డందియ్యకోజ్లేసి రాకన్న నాకున్న వేవేర
పేరాసలివెప్ప డప్పొంగి సన్మెచ్చి యేచొప్పునం జెప్పె
దో యప్పు డారీతిగాఁ జేయుడందాక నీచాయ సిలోయలోఁ
జేరి నీహాజ్జలంజేస్చి డెందాన కుందూను చిందుంపుముం
జెట్టబోఁ గొట్టి నీపట్టినక రట్టులో బెట్టకీ పట్టునం బ్రోవవే
పట్ప్రకొవ్వారె పొంబట్టు పుట్టంబుదారీ మొదల్పేయ
ముగ్గబ్బి పైబ్రబ్బి పెల్లుబ్బు దొడ్డెబ్బనా గుబ్బగా నీటిజా
లిమ్ముగా దొమ్మిసాగించు మొప్పెం బడంద్రోయవే యం
చువాడ్లాయఁగానే యవే తొల్లి ముక్కంటి శార్మ్రం జెవ్వై
ప్రేలు నీచానుల న్మెచ్చి కోర్కెచ్చినవ్వారు వేరంబుతో
మూగి జోగుప్పలం దెప్పలం దేలు మున్నీటి పెన్నీటపుం
పం జొరంబారి తొల్లింటి జేజేల నీచేతిక త్రింబడం మొత్తి
హా త్రిప్పవే బీరమెల్లాసలం గాసిలం జేయుగా నేల నాతప్పు
పోరొప్పి యీయొప్పిదంబీగ రాదే నినుందోరి కుయ్యాడనే
నెంతవాడ న్పుడిస్సంకు దాల్పా యెడల్పెద్దయై యుండ
నిక్కంబునోక్కెక్కబా వెంద్రుకం జెక్కగోతం దలం
పంగ లెక్కింపగారాని బంగారు పొట్టయ్యవై దెబ్బగుడ్డు
ల్చెలంగన్నచో నెన్నగానందులం దొక్కగ్రుడ్డందు నుడ్డా
మొగంబు ల్నిగారింపగా నేడుజానల్గ లాతండు నట్టోప్పు

దీలాటి వెన్నోగలయ్యెన్నినుంగాన నాపైనఁ గ్రేగంటిచూ
పాపి నన్నాక్రాపయ్యోఁ దింకెట్టులో దేవరా కావరా
సామినేనిప్పుడే కాదు మున్నెప్పుడు నగ్రజముల్దప్పి పోఁజే
యుగా వాటినిం జక్కఁ జేయుంగ నేమీరాు పుట్టిందటల్గంటి
నాకు న్బవల్దిర వేర్వెత్తనంబు ల్పెడంగాంచుచో మీ
లలో మిన్నపై వేగను న్నీటిపై బొంగులో వాడ నేజూడనో
డెప్పియుండిట్టి పెన్నీట దేలాడుచున్నంత తొంగున్న నా
పొట్టలో నెట్టులో చొచ్చి ప్రాబల్కులన్నెల గాదెచ్చి
పెన్మచ్చు గుజ్జంపుచేన్నద్రవద్రెండు గీరాడుచున్బోవ
నూరించుట ల్మీరెగా గాంచి కోమున్మప్పిపోనెత్తి నుత్తిం
టికింబంపి నాకియ్యవా ప్రాతమాట ల్కనుల్మాతలేనట్టి
జేజేల నోజంబడంగొట్టి రాకాసిమూక ల్జెడంగోరి కవ్వం
బుగా కొండ తేనిండు నీటన్మమంగంబొనుంగైన వేల్పయ్యె
నేకయ్యముల్గల్గజాలేని మందియ్యె తాబేలవై వీపు విప్పన్మ
లంజేర్చి సాగింపవే గొప్ప కేద్రిమ్మరిడప్పాలన్నెల చాపో
నం గుప్పగాబట్టి కొంపోవ నాగత్తరం గాంచి పెన్పంది
రూపంది నాకోరఁ జేకూరఁగాఁ జేయవే వానికిం చావు
బత్తుండవా మొత్తేను దన్నెత్తి దత్తూరమూడంగ రాదీద్ద
కంబంబులో యేడిరాయంచు జేకొద్ది గ్రుద్ద నవ్వాడి వ్రబ్ధి
లైనట్టి యా మొద్దులో తెరవ్రావా తీరునంబుట్టి బంగారు
పేరింటి కేద్రిప్పుడున్నప్పుడున్ద్రింపవే వాడిగోళ్ళందలారింపు
లేకెచ్చటన్దాకరాతో బలీందున్రిండు మున్జేయుజన్నంబులో
జేరి బిచ్చంబుగా నేల మూడంజలిమ్మన్న వాడీ జగంబెల్ల

ఖాగా విరాళించి మీఁగాళ్రండంగట్టి వానింట లేకుండఁ
బోఁగొట్టి సొమ్మంతయు న్వేల్పురాచాతనిం జేర్ప వేపొట్టిపై
దిట్టడై రాచఁడైనట్టి తోల్బుట్టువా ద్రేవర న్గొట్టగా బాఉ
రూపోషికంబూసి భ్రమఁదింపవే త్రెంపుళో నాలి గొంపోయి
పోరాడఁ దారాడునల్లాను మన్నీని నల్గింబ లెంజంపి యొవ్వా
రితో రాముడన్నేర నీవివ్వ డిచ్చోట మొప్పెల్పెడుంగు
ల్మ్రదుంగ న్గదంక న్మెలంగం బడంగ్లలాతండు తోఁడేర్పడ
న్బుట్టినావయ్య నేగంటి నీవాఁడనుమ్మంటిఁగాపాడనీవంటిఁ
బ్రోవంగ దేవుండవయ్యా! ౧౦౬

కం. అని తను వేడిన నలువం
గనికర మొలయంగఁ గాంచి కలుగు న్మేలుల్
దనివి సని నాఁడ మొఱచేఁ
బెనుపొందు మటంచు శౌరి వే సెలవిచ్చెన్.

ఉ, అంగుల కెంతయున్బ్రగడియుంచపంబుంబడితొంటియింటిత్రో
వంబుగినుండుబోవ గొలవారలు పిల్లలు దూడలంటిరాఁ
బొందగుపల్లెకుంజనిరి బోటులెదుర్కొని సంతసిల్ల నా
మందలవారు వేల్పితఁడు మాకనిసారెకుఁ జేరి కొల్వఁగాన్.

కం. ఇటమీఁదట వసుదేవుని
చిటిబిడ్డం డేమిచేసెఁ జెప్పుము నీవిం
బుటకఁగని నయ్యకొడుకా
దిటముగ వ్రేబుడుత తాచ తెగరా బేర్మిన్ ౧౦౯

కం. జక్కులదొర చెలికాఁడా
కొక్కొక్కడు కొడుకుపైని గూర్మిగలాఁడా

బొక్కులపేరుల వాఁడా
చుక్కల రాచతల నమరు సోముల తేఁడా. ౨౦౧

ఉ. బంగరుకొండవిల్లు చిలువన్నసగుల్లెకాడు వల్లెత్రాడు పొం
గొంగుల వల్లెదాలుపుల కోరియసంద్రము తూపుదోనె మే
ల్మింగనుపొట్టవేల్పు తొలిమిన్కులమావులఁదోలు రౌతుగా
నింగిఁజెలంగు పల్లియల నేర్పుగఁగూర్చిన నిప్పుకన్దొరా

మత్తకోకిల. పిల్లనిచ్చిన వానిజన్నము బిల్కువార్చిన దేవరా
కల్లలాడని తాపసిన్నకుకందగిల్చెడి వేలుపా
బల్లిదుండగు గుడ్డిరక్కసు బట్టి చీరినగట్టు వా
బొల్లిమోర పులుంగుటెక్కపు బూరగాడి చెలీతొలీ.

సీ. ఇవపు పెన్నలబిడ్డ యెకిమీని నెనరుచేఁ
దోచినయల్లికఁ దొలకువాఁడ
పాటిబండను పేరఁ బరగు నిల్వాడి నొప్పి
పురుషోత్తమాఖ్యఁ బెంపొందినాఁడ
గిన్నెపేరిటివాని వెన్నుండు గూర్చిన
కతలన్ని జతపెట్టఁ గడగినాఁడఁ
దెలుఁగునఁ గబ్బంబు గలిగింప సమకట్టి
తిండు రెండవపాళ మిటులముగిసె

గీ. దీనినెవ్వారు పుడమిని దీపులమరఁ
జదివినను బెరవారికి సరవిఁదెలుపఁ
దనకుదానె సిరుల్జేరుఁ దలగుఁకీడు
లట్టివారికి నల్లయ్యఁ డనువుపరుప. ౨౦౩

కంసవిజయము ౨ పాళము ముగిసెను.

ఓం.

# కంస విజయము.

## మూడవ పాళము.

కం. గబ్బిమెకపు రక్కసిదొర
గబ్బి యొడలితిత్తి నలువగా వ్రేల నివం
బుబ్బుమలపట్టి సగమం
దబ్బినమును కాటి బసుమమంజెను జేఁడా! ౧

వ. మనవి తలఁపునఁ జొనుపుము. ౨

కం. నలువ నెలవునకుఁ జేరిన
వెలపల నేమేమిసేసె వెన్నుఁడు దెలియం
బలుకుము సెవులకుఁ బండువ
గలుగ న్నడదారి యొడయ కడువేడుకగాన్. ౩

గీ. అనుచు శాలిని కోలచే నడిగి మనివ
రాచదొర మందలించ పోరామి దొరల
సీటి నడిగడ్డఁ బుట్టిన సెరవరి కొడు
కెలిమిఁ జిఱునవ్వు దొలక నిట్టులను బల్కె. ౪

ఉ. గొల్లలతోడఁ బల్లియకు గొబ్బునఁ జేరిన నల్లనయ్యతో
మెల్లన ముచ్చటించెఁ బసిమేసరిపెద్ద కడింది రక్కసు
ల్బల్లిదు లేగుదెంచి నినుఁబట్టగఁ బొంచుచు మించినాఁడవీ
పిల్లలఁగూడి దూడలకుఁ బేరెము లెత్తరు మొత్తి చెప్పితిన్. ౫

ఉ. పెద్దలు గిడ్డికాపరులు బీరముతోఁ జనుదెంతు రాలతోఁ
బ్రొద్దటినుంచి వారిజతఁ బొమ్మన నట్లనెయుంచు నాటి రే

యొద్దికఁ బుచ్చి వేగుతరి నొక్కఁడు లేచి సుమాళమొప్పఁగా
ముద్దులుగుర్పఁ బాడె నయము ల్పులకింపుచుఁ బిల్లగ్రోవిచేన్.

చ. అదివిని తెల్లవారెనని యమ్మలు లేచి పెరుంగుఁ ద్రిచ్చి పె
న్మ్రొద కుదురయ్యెఁ బల్లెకడ రొప్పగ వావలఁ బోదుకూడు బె
ట్టుదురె యటంచు వేగపడి డొక్క సడల్చుచు నార
గించి యా । గదుపుల వెంబడించి చని కన్గొనియె న్నల
జాలు పేరోగికన్. ౭

సీ. తనమేని పస యనఁదగు నీటివడిదానిఁ
దరఁగల నొడ్డంటి పొరలుదానిఁ
జేపల మేపుల కాపుకొంగలదాని
మొసళుల సందడిఁ బొసఁగుదాని
నీటిమానసి జోళ్ళు దాటులాడెడుదానిఁ
బ్రాచిబామిన రాతి పసిమిదానిఁ
గలువపూ వలపు లంగడివోలెఁ గలదానిఁ
జిలువలు దరులంటు మెలఁగుదాని

గీ. మిన్నొరసి చుక్కలను బుగ్గలున్నదానిఁ
గొన్నినాళ్ళకుఁ దన పొందుఁ గోరుదాని
బన్నసరముల చిదురుప ల్బరగుదానిఁ
గనియె వినుమానికపు బిడ్డ కప్పుగడ్డ లా

ఉ. అందొక యోరఁ బెద్దమడుగాగి పడంతులు దాను గాళియుం
డిందెన లేనిబీరమున నెంతయుఁ బ్రేలుచు మీఁద బాఁకెనన్

వందురిగూలు పక్కిఁగుమి వా బుసకొట్టి సెకల్గలంపనా
చందమెఱింగిచేరె నలసామి హుటాహుటిఁజిల్వరాగుడిన్.

వ. ఇట్లాతానకంబరసి కఱెపాము గదువతనంబు నురికించు తలంపుతోఁ ధలంట ముంగురుల యుంగరంబు లెగద్రోపి చేపిశికి మించిన పిల్లనగ్రోవి నుల్లంబంట బిగించిన పైఁడి మొల్లియలోఁ జెక్కి నిక్కి యొక్క ప్రమానెక్కి గ్రక్కున గబుక్కున దుమికి నీటిపోటులు గాటులువడఁ జేయాటలం జిమ్మి ముమ్మరమ్ముగా నీదులాడ వాదులాడఁ బోడవలె గోలు కుడువవచ్చె నిచ్చెడుగు బుడుతఁడుచ్చిపాటఁ గోఱలం జీరుదునని ప్రాఁచులదొర మేను సాచి రా లచ్చి మగం డిచ్చకొలదిఁ హెచ్చి పచ్చిపాగరున నెదురుబోవ నాచిలువ ఱేఁడాచక యేచి పైకెగరబారి తూరితూరి కాటుకాటున కేటి కాలువ బారునట్లు నెత్తురు లురులఁగఱచిన. ౧౦

చ. తొలగఁడు కేకవేసి వెఱత్రొక్కటపాటును జెందఁ డన్నద
మ్ముల పిలుపున్గడింపఁ డటుపోవుటమానఁడుచిన్నవాఁడువె
ల్వెలబడి మోముత్రిప్పఁ డిదివింతగ్రుక్కఁడు చేతులొడ్డఁడే
తలపుననోయెఱుంగమని దయ్యములబ్బురపాటునొందఁగాన్.

చ. తనవడి దూల గాయముల దంచడిగాఁ దెగజీగఁ జిల్వరా
వెనుతవులాటమున్వదలి వేదురుపోలికఁ నిల్వఁబల్వనీ
వెనుఁకువదక్కనా నిలుముపీచమడంతునునిల్వుమంచుఁ జే
ననువుగఁబట్టి వేపడగలట్టిటుబొర్లుచు మేనుద్రిప్పఁగాన్.

వ. కృష్ణుండు: ౧౩

గీ. పిసికి పిసికి యొత్తి పిప్పిగాఁబడగల
నలిపి నలిపి మేని మెలికలురులఁ
దిప్పి ద్రిప్పి మొగము నొప్పించి డాకాల
మట్టెఁబొట్టలోని కట్టెపోవ. ౧౪

కం. తప్పించుకొనఁగఁజాలక
గుప్పున నెత్తురును గ్రొవ్వుఁ గొలకులవెంట.
నెప్పులయి జార విడిపడు
చొప్పెరుగకఁ దస్సెబాము సొమ్మలు ముంపన్ ౧౫

వ. అంతటంబోక.

సీ. కాలితాకుడులఁ జెక్కలువోవఁ బడగలు
నట్టువ బిట్టుగా నడపి నడపి
తనుజుట్టుకొన్న తోకను జేత మెలిద్రిప్పి
విసరి చెట్టులమీఁద వ్రేసి వేసి
గబ్బికోఱలు పాదుగదిలి నెత్తుటదోగఁ
జేబలువున గుంజి చెరిచి చెరిచి
తలతలఁగల నాలుకలువట్టి తుంగఁ జీ
ల్చినరీతి రెండుగాఁజీల్చి చీల్చి.

గీ. కనుగొలకులందు నోగులుగాడబొడిచి
తలనరంబుల పట్టూడ్చి కలచి కలచి
పలువగలకస్తి నెతపుట బ్రతుకుమాట
వదలి సొమ్మసిల్లెం బెనుపాపఁడేఁడు. ౧౬

వ. అట్టితఱి.

ఉ, పెనిమిటి సోలుపాటువిని బెట్టుగ నేడ్చుచుఁ బాపముద్దరాం
డ్రినుఁగులుఁజుట్టలుం బలసి యంచులరా దిగులొప్పఁ జేరి నె
క్కొనుతమి నయ్యయో తెలిసికోక కడంక నెదిర్చియిట్టిపా
టొనరితి వింకనైన ముదుగోటమి వేమము తెల్వితేటలన్

చ. అవి మగనింగుఱెంచి మొదటాడి హరింగని కేలుమోడ్చి మా
మనవులు సొన్పు డెందమున మామగఁడీల్గిన దిక్కులేక యే
యనువునఁ బొద్దుపుచ్చఁబడునయ్య మొఱల్విని కాచి వీనిఁజ
క్కని కడగంటఁజూడుమని కస్తిగడల్కొన మ్రొక్కి రొక్కటై

గీ. మొదటిపెండ్లి నేడు తుదముట్టె మరలంగ
మగనిఁ గలిపి పెండ్లి తగనొనర్పు
మంతదాక యడుగులంటి లేవమటంచు
సారె సారె వదరి సాగిమ్రొక్కి. ౨౧

వ. పాపపూఁబోఁడులు మఱల మొఱలు దొరల నిట్లని పొగ
డిరి,

సీ. పెనునీటివెల్లువఁ బిరికితనము లేక
ప్రాఁజదువుల దొంగఁ బట్టితీవె
తరిగొండ కడలి నొత్తగిలఁ బెన్తాఁబేటి
మేటి రూపొనరిన పోటరీవె
పైడి క్రన్నాకాసిబట్టి చెంపుటకుఁగా
నొంటిగాఁడైనట్టి దంటవీవె
నమ్మినబత్తుని నడత చెల్లించుట
తగపని సింగమై తనరితీవె

గీ. మూఁడు కాల్ద్రొక్కుడులఁగోరి ముజ్జగముల
నాచికొని వేల్పు వెఱక్రిందఁద్రోచితీవె
గండ్రగొడ్డంట రాచవంగడము లడఁచి
పుడమి బాపలకిచ్చిన ప్రోడవీవె. ౨౩

గీ. ప్రొద్దు కాలమునఁబుట్టి పెఱపాలసుదిండి
నాలికై కూలఁజేసిన యలఁతి వీవె
యిపుడు మడియల సమయింప పచ్చఁబుట్టి
తోలఁగు వెన్నుఁడ వీవగ తలఁతు నయ్య! ౨౪

కం. ముందుతిగవీళ్ళ ద్రిమ్మరి
పందల రక్కసులఁగూల్పఁ బోల్పడెదవు మే
ల్గుందఁగ ముడిచెవి రౌతుల
నందఱఁ గూల్పంగఁ గలికి వౌదువు తెలిసెన్. ౨౫

ఉ. ఈచెడువాని సేఁత మదినెంచక వేఁడెను మమ్ము మన్పఁగా
నీచెవి దార్చి మాకుయుల నిల్పుము రాయిడి కోర్వ లేఁడికన్
గాచిన నీవె గాకొరులు గన్పడ రేదెసఁ దండ్రి మానవే
యేచుటలంచు సాగిలిరి యెంతయుగొంతులు వ్రీల నేడ్చుచున్

ఉ. ఆమొఱలాలకించి సిరి యన్నువ దైతుఁడు రొమ్ము ద్రిమ్మరిం
బోమని తాఁదొలంగుటయుఁబోక యెదుర్పడి మొక్కి యింకఁజా
ల్నేమము సంతరింతు జముసిం దొలఁగించిన నిన్నె కొల్తు నా
పాముకొలంబు వన్నెఁగనెఁ బాయక డెందముఁగీమునీకగున్

సీ. పుక్కిట విసమొల్కు పుట్టువుఁగలవాఁడఁ
గనవిన వినఁగనఁ గానివాఁడ

వంకర నడతల వాసికెక్కినవాఁడఁ
బుట్టలెక్కుడు పనిఁ బొసఁగువాఁడ
నడుగు బట్టుడుఁబు వెంబడి రాఁ దిరుగువాఁడ
నిదుర మంపే వెంట నెగడువాఁడఁ
గాల్సేతులొందని గజ్జి యొడలివాఁడఁ
దలల రారాపిడిఁ గలుగువాఁడఁ

గీ. జెడుగు పుట్టుక యనెడు పేరొందినవాఁడ
నిట్టి నను బట్టి నలుపుట యెక్కువయ్యె
కపటరము బూని కాచినఁ గావుమయ్య
గెడపఁ దలఁచినఁ గానిమ్ము జడుమీఁ కేల. ౨౮

వ. అని మఱియు నిట్లనియె, ౨౯

మ. తలనీయుంజ పోసంగి దానిఁగని నాతప్పెన్నికం జేసియుం
దలపం జెప్పడు కంటగింపఁ బెఱునం దార్క్షణాగానిల్చుచో
నల మున్నక్కడొరన్న నాతనికి నీకైనట్టి వేరం బదె
ట్టులో నెప్పన్దగుదన్న కాళియుఁడు గుట్టుం దెంపితానిట్లనెన్.

సీ. రమణకమను దీవి రచ్చగా మావార
లుండుటఁ గని గరుడుండు వచ్చి
బెదరింప నాగులు పిరికితనంబున
నెల నెలఁ బ్రజలిచ్చు చలిమిడులను
నాయన కుడుగరఁ జేయ నేనటు సేయ
నీక చల్లాడిన నెత్తుకొంటి
నది కతంబుగఁ దల లడఁచినఁ బరువెత్తి
యిచ్చోటఁ బడి డాగితేను నాతఁ

గీ. ఓడఁ దిరిగినఁ జచ్చిన ట్రీరసమున
నొక్క జడదారి సాపించు టొప్పు వింటేఁ
గానఁ బోయెద నాదీవి గాలుకొనఁగ
సెలవె యని యాఁచువారితోఁ జనియె పాపు. ౩౧

కం. ఆపా మరిగిన మొదలుగఁ
దీపిందగు సీసుద్రావి దిగులు నసిపి రా
లాపరు లొడ్డుం బట్టిన
చే పిల్లనగ్రోవివాని చేఁతఁ దలఁపుమర్. ౩౨

ఉ. బిడ్డనిఁ బాము పట్టినని బీదలఁబోలె నెగుల్లలంపఁగా
నొడ్డునఁ జూచుచున్న పజ లూపిరిదెప్పి కూడివచ్చుచో
గడ్డిపొలానఁ బల్లియతుఁ గాఁ జను త్రోవఁగనంగలేక నా
దొడ్డిగ రాత్రిరైనఁ బడిదోఁగిరి నిద్దురమబ్బుసోలునర్. ౩౩

కం. అందఱుఁబడి నిదురించెడు
సందునఁ గార్చిచ్చు రేగి సదమద పెట్టెర్
వందుర మేల్కసి సిరి మగఁ
డెందేమని కళవళమున నిట్లని పల్కెర్. ౩౪

శా. ఏలాయేడ్పెదరొక్కపెట్టతొలిజామే తెంచె నాయొంటమిం
బోలంజూడుఁడు చిచ్చువుట్టదుగదా పూరిర్ రవుల్కొంచుచు
వేల్పులన్రక్కసుఁ డెవ్వఁడేని దురుసై వెన్నాడిసొలించెనా
జాలింజెందుటకేమియంచుఁగినియం జూపొందు కార్చిచ్చునర్

కం. ఈచిచ్చునకా జడిసెద
రేచను మిమ్మోడఁతుననుచు నెదురేగి వడిం

దాచినఁ జల్లారక పొగ
రేచుట గని డిగ్గ్రదావ నిది తెలియనుచున్. ౩౬

గీ. కత్తి నేస్తకాఁడు గ్రక్కునఁ గడిసేసి
చిచ్చు మ్రింగె దానిఁ జేడెలెల్లఁ
గాంచి దేవరితఁడు గాకున్న నెరగలి
మ్రింగ నొరులకగునె మీఁగడవలె. ౩౭

వ. అని తలఁపోయుచు ౩౮

కం. మఱునాఁడు శేపకడ నం
దఱు గీములు సేరి వెన్ను దమపాలిటి దే
వరఁగాఁ దలంచి మ్రొక్కరి
గుఱి నిల్పినచోటి కొదువఁ గూలుదుమనుచున్. ౩౯

ఉ. ఎప్పటియట్ల కారడవి నెల్లెడల న్బసిమేపఁబోయిరా
నప్పెలెవారి నందుఁడను నావులమందల మమ్ముమిమ్ములం
దిప్పలు మాన్పి ప్రోవఁగలదేవర నేల్పుల ఱేఁడు జాతర
న్మెప్పుగఁజేయ వేలిమికి మేకొని పల్కె మెడాటమందొగిన్

చ. కొడుకగు వెన్నుఁడంచుఁ గొని కూడని చేఁతలఁ గొగ్గిమాటసం
దడిఁ బచరింతురేల కన దబ్బర మబ్బులు మేనఁగన్ను లొ
ప్పెడు దొరసామ్ములే యతని పేరిటి జన్నము సేయకున్న నీ
పుడమికి వాన లేదె? వినఁబోలునె యిట్టికువాళము ల్వెవిన్

సీ. తొలి తాత జగములు గలిగించినప్పుడే
వను లందఱకుఁ బంచె బరువు లరసి

మొగులు గుంపులకు వాన గురియుటలు వెట్టె
నవి దప్పి నడువరా దరయుఁడోసి
వేలుపుమన్న కామేలికతనమిచ్చె
నంతగా కాయన నడగింప
మానునే బొమ్మకు మారాడ నేరికిఁ
దరము గాదింతియు తాల్మినుండుఁ

గీ. డేను గలుగంగ మీకేమి యితని జన్న
మున కొనర్చిన దంతయుఁ గొనుచు వచ్చి
కొండ గవినున్న వేలుపుఁ గోరి తలఁచి
జాతర పొసంగఁజేయుఁడు సమయు గీఁడు. ౪౨

వ. అని చెప్పి యప్పిల్లండు మళ్ళించిన గొల్లలెల్ల నల్లంబుల
నల్ల నయ్యా జెయ్యా నియ్యాకొసిన పని ప్రయ్యానని తలంచి
చెప్పినట్ల యొప్పి తెప్పునం జని కొండ జాతర దండివడఁ
జేసిన నా లచ్చిమగం డమ్మలయందు నెలవుకొని వార
లిచ్చు కానుకలు పుచ్చుకొనుటఁ గాంచియు మొరకులగు
దొడుకు కాపరులు గట్టు నత్తియే మని యొంచి యొఱి
కొకళ్ళు తెల్పుకొనుచుండి రట్టుటున పసిడివలువదాలుపు
వేలుపు వేడువారిలో నొక్కండై తానును నట్ల సేసె
నతని నెఱతనంబు దెలియ నేరికి నలవిగాదు. కావున
నంతయుం గని తెఱగంటి మఱియును. ౪౩

ఉ. పొగరెగదొట్టి తొట్టుదొరపోరఁడు సెప్పిన మాటఁబట్టి సం
దుగని మిరాశిగా జరుగుదోవదె మల్పిరి గొల్లలిట్టిచోఁ

దగఁదిక నూరకుండనని నవ్వులనెవ్వ మొగుళ్ళ జీరి బె
ట్టుగ నెలవిచ్చె వాన కసటుంబడి పల్లియ పొల్లు సేయగాన్.

వ. అది విని యారుమూఁడు తెగల మబ్బులు. ౪౫

ఇంద్రవజ్రము. నియ్యార్యనఁ జెల్లింపఁగఁ బోదుమంచుం
నయ్యాటల న్దెప్పున గుంపులౌచున్
గయ్యాలకై సోయెడు రాచలోనా
వెయ్యారు లేగ న్వినుదారి వేగన్. ౪౬

వ. కదిసి మదంబుట్టి ముట్టి, ౪౭

సీ. మొదట సన్నపుజల్లు మొనకొల్పి జడి సూపి
బెట్టైన యుఱుములఁ బెచ్చు రేఁగి
మెఱుపుల తళతళ మిఱుమిట్లు నవరించి
యాకప్పు లంతట రాలఁ జేసి
మొగమెత్తకుండంగ మునరి వానల ముంచి
వరదల తాకు దవ్వారి బఱపి
చలిగాలి విసరుల జంపుగా నెసగించి
గుడిసెల గోడలఁ గూలఁద్రోసి

గీ. మందఁ జీకాకు సేసిన మంచి గాన
కపుడు గొల్లలు గావవేయనుచు నందు
పట్టిజీరిన వారిఁ జేపట్టఁదలఁచి
దిట్టయై వేల్పుదొర కొప్పమున్న లేచె. ౪౮

వ. లేచి యేచిన యలుక నిట్లని డెందంబునం దలంచె. ౪౯

మ. తనకై జన్నము మాసినారనెడు పెన్దప్పెంచి నూరంచులం
దిన వాల్దాలుపు కిన్కచే గరువమందె న్వానరా నేమిసే
తునొ గందామని కాని మంచిదె యడంతు న్నమ్మి నన్నన్నవీ
రిని నిప్పట్టున గాసిబెట్టి మఱియేరీతి న్ననుఁ గాఁడాయునో.

ఉ. అప్పటిమాట జూతమని యప్పలె చేరుననున్నగట్టు బా
గొప్పగ మీఁదికెత్తి జడికోడకు డింతులు పిల్లలు న్బసుల్
తప్పక చేరుఁడన్నఁ జలితాకుల మేనులు జల్దరింపఁగాఁ
దెప్పునఁజేరి రొక్కమొగి దీవన లిచ్చుచు నాలగాపరుల్.

కం. జడి విడువక కురియఁగ నల
జడి చెడి కడువడకు టుడిగి జతజతలుగఁ దో
క్కుడుగాకయుండ నిమిడిరి
మిడుకుట లెక్కడివి సామి మెలఁకువఁ గవినన్. ౫౨

కం. బేకామగ రాల్చినుకులు
జోకగు ముత్తెములు గూర్చి చుట్టిన కుచ్చు
లా కొండ గొడుగుఁ బట్టెను
రాకాసుల సూడు చూపఱకు వెఱగొనరన్. ౫౩

గీ. ఏడురేఁబవళ్ళు నెడమీక జడివట్టి
కురిసికురిసి మబ్బుగుంపు లఱచి
కడకుఁ గడుపు లెండి కడలి కడకు పడి
జరిగె వెల్గుఱేఁడు జగ వెలుంగ. ౫౪

కం. అడిగని గొల్లలు తమ తమ
కదుపులతో బయలుదేరి కడువేడుక నిం

పొదవి హరిఁ బొగడసాగిరి
మొదలిటి ముచ్చటలు దలఁచి ముదితలు దామున్. ౫౫

కం. అదిగని మబ్బుల వదరుచు
బెదరక గ్రమ్మరుటకొఱకు బిరుసుకొనుచు వా
లదలకుఁడన మొగులతెగ
ల్పెదరి కుదరకున్న విసివి జేట్పాటు దగన్. ౫౬

వ. ఇట్లని తనలో నుమ్మలించె. ౫౭

సీ. కారులు వదరుచు నోరెఱుంగక మబ్బు
తండంబు నడిపితి దానివలన
మోసంబుగలిగె గట్టె సత్తి గొడుగయ్యెఁ
దెలియంగ నబ్రిమా దేవునడత
పుడమి బరువు డింప దొడుకు గాపరియింటఁ
బెరుగుదునని తొల్లి బేరుకొనియె
నది మఱచితి నిజం బాతఁడే యాతండు
ననుఁ గాచుటకుఁ బుట్టెనని గణించి

గీ. తలఁపు లీనెడుగవి వేల్పు వెలఁదులతికి
వెంబడింపంగ జముదొడు వేల్పటంచుఁ
బొలములోనుండు వెన్నసిఁ బొగడు వేడ్క
వచ్చెఁ దెఱగంటి దొరలతో వాలి వంగి. ౫౮

వ. వచ్చి,

చ. కనుగవకబ్బురంబగు చొకాటపు నల్లనిమేనుప్పెఁడి ప
చ్చనినునువల్లె యాఁదలపసందగు నెమ్ములకన్నులీకల

కుక్కనవగఁ గుల్కు పెద్దపులిగోరుల బిళ్ళయుఁ గల్గు గొల్లపి
ల్లని నలసామిఁగాంచె మొదలన్గతి వాఁకకుఁ బంగటొక్కనిన్

వ. కాంచి నిక్కుదెవుల జక్కని గ్రుక్కనడిగ్గి మ్రొక్కి డగ్గు
త్తిక నగ్గలంబుగా, ౬౧

ఉ. మేలిమి వాఁటలంబొగడె మిత్తినిఁదన్నిన మన్నెబొమ్మయు
న్నాలిదినయ్య మీమొదలు గాంచి గడింపఁగ లేరు నేఁగన
న్జాలుదునే కనుంగొనలఁ జక్కఁగఁ జూడుము తప్పిపోతి నీ
పాలిటివారికి న్వ్రతలు వాటిలఁ జేసితిఁ దప్పుగాచవే. ౬౨

శా. నన్నుంగాచుటకేకదా మొదటిమేన న్జేప రూపొప్పఁగా
మాన్నీటన్దిరుగాడి రక్కసుని కొమ్మున్గొమ్మునన్గ్రిచ్చుట
ల్వ్యాపించి మలం గుదుర్పఁబడి తాబ్రైలితి బోనంబులే
కున్నన్జావని మందొసంగుటకు మాకోహో పరాకొందితిన్

గీ. ఒంటిగాడవైతి వో జగంబులమేల
యుడికనులవానిఁ బట్టిచంప
నతసితోడుఁ ద్రుంపనైతివి తెరనోటి
దేవరవు తలంప దిక్కునీవ. ౬౪

శా. బిచ్చంబెత్తుట నాకొసంగెనెగదా బైలైతి మున్నెట్టివై
కచ్చెం రాజులగోలుపుచ్చుటలు నేఁగాఁగోర మన్వ్వల్పవై
దచ్చింబైనిరుకుత్తుకల్లలుగు పందంజంపి మమ్మొందఱ
న్బెచ్చుంజెంద నొనర్చితే మసిమిము స్వర్గొందు నాల్గాపఁడా

ఉ. ఇచ్చుటబుట్టి నస్గలఁచు హెచ్చుగరాసుల నంజుడానుల
న్వ్రచ్చుటకే నిజంబు తొలివాఁడవు మైమఱచిట్లు సేసితిన్

రచ్చలబెట్టకేలుము దోరా పదినూఱులుమొ్రక్క వాఁడ నా
మెచ్చిప్రియంబులాడి కలిమి న్దగదీవనలిచ్చి వెన్నుఁడుణ్.

వ. అంతటంబోక,

గీ. బాసవాల్గ్రచతలపిచ్చు పసి పితికిన
పాలదడిపాల దడిజేసి బత్తిసూపి
పనివిసిరెయి కుంకిరుగంగఁ బదపడి వారి
పల్లెకరుదెంచె వెలదుక ల్లఁబోగడ. ౭౦

వ. అమ్మరునాటి రేపటిపూట నాటలం దోడివారు దానునలసి మెసవుటకసదుగా నింటినుండి తెచ్చిన వంటకంబు సాలమి డీలుపడి బోనంబులాను వేడుకఁ దోడుకాం ద్రతోఁ గప్పు పైఁడిపలువదాలుపు లీదాపునఁ గొందఱు వారులు వేలిమి తొలిపలుకుల చొప్పుఁ దప్పకుండ ద్రేలిమిఁ ద్రిప్పుచున్న వారందేగి మేమోగిర మడిగితిమని వేఁడి వేడిచెడని పసాదంబు దెమ్మని యనిపిన వాసాదని గునగుననరిగి వారలా బాపలతో నీపజ్జ నాపదవుల మేపుచుఁ దాడిపక్కి సిడంబుల యొడయలు మిమ్మడిగి కమ్మని కూరచారోగిరంబులు దేరఁ బనిచినారన వారు కంటికడ మంటలుబ్బఁదబ్బిబ్బులాడెదరు కొంటెలారా వంటకంబు మింటి ద్రిమ్మరుల కారగింపు సేయకనే యగ్గినేఁబోయక నీయంటిబోయల కీరాదుపొమ్మనిన మఱలుటగసి వారిగఱిత లరుతపశ్వైరంబుల కొలఁది మిలమిలని యావకూర వేపుడుకాయలునిచిన బువ్వపై నివ్వటించి ద్రేబుడుతలబడి యడఁగిఁ జేరి ద్రొక్కి తెలియని

మగల యుక్కి వంపుమాటలకుఁ బెక్కు బట్టకుఁడని యప్పన
సేసిన నప్పుడే మెసవి తెప్పున, ౬౯

సీ. వెలఁదుకలార మీ వేఁడుక లోనఁగూడు
నోడయులు దెలియంగ నోపకున్న
మమ్మెఱిఁగితిరింక మాను మీకీడుములు
మఱిపుట్టుగల్గదు మగలఁ గలిసి
వేలిమినిగ్గించి వేమరు నాపేరు
మదినిల్పుఁ డనుటయు మంచిదనుచు
జన్నంపుచవికంట జరుగ మవ్వేల్పులు
జప్పను లఱిగిన జాడఁ దెలిసి

గీ. యింతులా తొలివేల్పుల చెంతకరిగి
ముత్తి తెరవరు లగుటలు ముచ్చటించి
రాఁడులకుఁగల్గు తెలివిలేదయ్యె మనకుఁ
గోడిగంబయ్యె బ్రతుకని గుదులుకొనిరి.

శా. ఏ వేల్పిచ్చదగుల్పఁ గోరి దరులందే నగ్గులంగూర్చి చెం
గావుల్మించు జడల్ తిరుల్మోనయ ముంగాలంటుతో వేడిన
న్నోర్చివన్దెప్పనదాని సామి వెలఁదు లోర్చనంబాసంగ న్మది
న్దావాదంబున మెచ్చె వీసు తొలినేదారికే హారికగొల్చిరో

వ. అని తలఁపోయుచు,

కం. ఆవులమేపఁగ వెన్నుఁడు
బో వెంబడి లోయకరిగి పూసిక వేడుకం

ద్రోవఁ గనరామి వారలు
లేవడి డొందముల మందలింపుచుఁ గొదువల్. ౭౩

గీ. మఱలివచ్చి తలఁపుమానక పేర్కొని
యెఱుకవిడక కొల్వ నెఱిగి శౌరి
జన్మమంకుఁగుడిచి సరవి వెన్కటిపుట్టు
కొలలరూపుమాపి కోర్కులొసఁగె. ౭౪

ఉ. అంతమఱొక్కనాఁడడవి కన్నయుఁ దానునుబోయి రాలతో
బంతులతోడనాఁడుతరి బారులుదీరిన పిల్లగుంపులో
సంతసనొక్క పిల్లఁడయి చాపగుమొక్కలి రక్కసుండు గే
లింతలు సేయుచుండఁ గనలెన్బలరాముఁడు వానిచేతఁకుఱ్

వ. అపుడు.

శా. వాఁడువ్రేత్తుగనాతని న్బొదివెఁ జేవన్వీపుపైనుండి ముం
దా దైబల్విడి నేఁగ నేర్పడు చులాహా యంచు వాపోవఁగాఁ
దో డైపోవక వెన్నుఁడాడ బిలిచెం దూలింపగాఁ జాలుఁ జా
మూడెన్వీనికి రాముచేతననుచుం మోసంబు బెన్ గూరిమిన్

కం. రేదిరుగుడు దను నలపఁగ
మీఁదెఱుఁగక వచ్చెపీని మే బలువెంతో
పాదంటఁజూతునని యపు
డాదట నేమనకయుండె నరగడియ చనన్. ౭౫

ఉ. మ్రాఁకులచాటునన్నిలిచి రాపడిరాముని రాలఁద్రోయఁగా
డీకొని రెండు చేతులఁ దొడింబడకుండ మెడన్బిగించి కా

ల్గాకులఁ బొట్టఁదట్టి బెడిదంబుగ నేలకు నెట్టి ఱొమ్ముపై
కేకసఁగొట్టి బిట్టడఁచెఁ గిడ్వడిసావఁగ నాప్రలంబునిన్.

ఉ. విలవిలఁ దన్నుకొంచు విడువే బరువైతివి మోవఁజాలఁ బె
న్బలియుఁడవీవు జంపెదవె పారెద వచ్చినత్రోవమాని ని
న్నలన కెదుర్పనంచు వెతగార్కొనఁ బల్కు రువాఁడు వేఁడిన
న్బలుకక చావఁద్రొక్కె మెడపట్టునఁ గాలమరించి దిట్టయై.

గీ. నోట ముక్కున నెత్తురు లేటికాల్వ
తోటి సరిబార నూపిరి తొలఁగి చనియె
నపుడు గొల్లలు సంతసమంది గంతు
లంత టంతటఁ బచరింపనైరి చెదరి. ౮౧

శా. ఆరాకాసిదురంబున న్నొగులము న్నొజళ్కుబోవంగ జే
జేరారామునిమీఁద మింటఁ గురియించె న్బాలవానల్గురిన్
బేరుల్మ్రోసెను వేల్పు బానిసెలు కన్బింకంబులవ్వారిగా
బారుల్దీరి పొసంగఁబాడి రిగురు ల్పట్టంగఁ బెన్మ్రొద్దులన్. ౮౨

వ. అంతట వారలు. ౮౩

ఉ. మాపగుటాలఁ దోలుకొని మందకుఁ జేరిన గొల్లజవ్వను
ల్ద్రోపడి వచ్చిచూచి వడిఁ ద్రుంగిరి రక్కసులెందఱేని నీ
పాపలఁ జంప నెవ్వఁడొకొ పంపెను బెన్పగఁబట్టి వారుబో
కేపగిదిన్నిజంబగునొ యెవ్వాఁడు వింధు మటంచు నెవ్వగన్

వ. కొంతసే పాడికొని తిరిగిజరిగి రామీఁదట, ౮౪

గీ. ఒక్కనాటి రేపటోపికఁ బాలమున
నాలఁ గాచుచుండి వ్రేలుతాటి

వడగ తెల్ల పామి పజ్జకుఁజని పల్కి
రున్నరూపుఁ దెలియ నోపికమర, ౮౬

సీ. ఇదటికిఁ జేరువ నెసఁగు తామసులమించు
టడవియందులనుండు నావటముగ
గాడిదెరూపున గడిమెకం బాతండు
గాపాడువాఁడొట గాలికయిన
రాలవు పందులు రక్కసి యెకిమీఁడు
పోరుల మడియని పోటరి యని
యటువోవ వెఱచి యందరుగ రెవ్వరు గానఁ
జక్కఁబంపుదె పండ్ల చవులెఱుంగ

గీ. ననిన మంచిదినా వార లపుడెతూగి
నడచి మ్రాకుల నూపిన నాల్గుదెసల
రాలి నిండిన పండుల నోలినమలి
కూల ద్రోచిరి బెట్టుల గుమురులచట. ౮౭

వ. తెప్పతెప్పనంగూలు మ్రాఁకులు చప్పుడువిప్పగుట నప్పా
లదిండి మొప్పియిప్పెడు మ్రాఁకులగుప్ప గూలఁజేయుటకే
దిప్పకాయ లప్పళించిరో నన్నన్నడు గన్నవారు గాఁరొక్కొ
క్కతన్నునం బెక్కుఁ బొదిఁ ద్రుంపుమనని ఖరాసురుండు
దాపు జేరి యోరీ పూరిగఱచినం బుట్టలెక్కినం బోసిను
మానుల పడద్రోచుట బ్రతుకాస వదలి చేసితిరాయను
యడమున పుడమిదేకు వాలుదాలుపమ్మాటవిని తోకద్రో
క్కిన కంటి విన్కలియొనుపున బుస నెఱపుచుఁ గరాసారా

రాప్రొద్దుకొనుకు మిద్దె యొద్దఁ జేరుతునవిన నవ్వి వాఁడు
క్రొవ్వననీవారొకటి కైనూవేదియుని యెగతాళిసేసి వాడి
గిట్టలగట్టిమీఱు వెనుక కాళ్లు గేడించి జాడించి తన్నిన నా
ప్రలంబరక్కసిసూడు వాఙారిబడితిఁ వింతేరా యెంతో బిరు
సాడితివీ కాలితాపున కేనాయని యాయుడుగు లిరుచేతులం
బట్టి గిరగిరం ద్రిప్పి గొప్ప గొప్ప ప్రమాఁకుల నొప్పించి సుడి
వడ వడివిసరి పారవైచిన ౮౮

గీ. తొండవలె వ్రేలఁబడి నేల ద్రుంగుకుబడ
బిట్టు పొరలాడి వానల్ల పెకలిపాఱఁ
గొండగవులెల్ల నిండంగఁ గేక వేసి
మిడిసిపడి చచ్చె దివివారు మేలనంగ. ౮౯

ఉ. గాడిదె రూపురక్కసుఁడు గంతుగొనం బెను సంతసంబుతో
నేడిదె తాడితోపుకడ నిల్వ దిగుల్వొరి వోయెనంచు నో
టాడుచుఁ బందులుం జిలుగుటాకులు దెంపుచు నిచ్చవచ్చిన
ట్లోడక సంచరింతు రరుదొప్పఁగఁ గొప్పగు ప్రాపుకొమ్మచేఁ

వ. ఇట్లొప్పుచుండ వానతఱిమీఱిన. ౯౧

సీ. కలువాఁక నీరుచొక్కపుఁ దేటఁగనుపట్టె
బురద బిట్టెండలఁ గరుడుగట్టెఁ
గసవాని పసిగుంపు మిసమిస జూపట్టెఁ
గొర మెకంబులు గూడికట్టె
జాజిపూగాయల జతకట్టు నెగదొట్టెఁ
దెలికొక్కెరల వడి పొలయుమెట్టెఁ

జేమంతి గన్నేరు చెట్టుల నవపుట్టి
దోరగుంపు కపిసేయు మరులునెట్టెఁ

గీ. జదలురతనంబు వలదెసఁ బొదలఁబట్టె
బీదకాపెత మెతుకబ్బి ప్రేలఁబట్టెఁ
గడవపుట్టువు జనుసింటి కడకుఁజేరి
మింట వెలిగెను తటిఁబస మించిపుడమి ౯౨

ఉ. కన్నుల తుంటవిల్లు నెసకంబుగ విచ్చిన పూలకైదువుల్
చెన్నగు వాఱుకాల్వ తెగదీర్చి నారియుఁబూని జవ్వనం
పన్నవ గుంపులం గలవ నామనినేస్తుఁడు చిల్కవారువం
బెన్నికమీర నెక్కి మసియెం గొరవంకలదండు వెంటరాన్

సీ. వక్కలాకులు సున్న మక్కళించిన జాలె
యడపంబుఁ గుచ్చెళ్ళ యందుదోపి
క్రొత్తముట్టల్లిక కుచ్చులబిల్లట్ట
వడిసీలఁ బేనుగా మెడను వైచి
దున్నఁబోయిన వారి దోసిటంబటి దుత్త
కుదురుంచి నడునెత్తి గుంటగుదిపి
చిఱుతవన్ని బుకోక చెరుగు తొగరుకమ్మి
మడత రొండికిదార్చి మలిపి నిలిపి

గీ. కాపుజవరాండ్రు వరిచేల కాపుకొఱకు
నీటుకుల్కఁగఁ గనఁబడ నెరులు నొసటఁ
గొప్పకందకచిందాడఁ గులుకునడల
పొలము కగుగుట లొప్పు నప్పాటలంగా. ౯౩

శా. పండెన్నెట్టపువాసపైరుగుమి దిప్పల్గాఁగ పిత్తుల్బైన
ల్బొండేల్గొబ్బెర మ్రాఁకులం గలిగెఁ దీపుల్మించె నించుల్మడి
న్బండన్బారిన పెద్దరాజనము ప్రేంకన్గోఁత కాఁ ద్రొప్పఁగా
రెండల్బానలు దోడుతోడ బలు పమ్యొన్నాచ సూడుల్దగన్

గీ. తెలుపవలింటి తెలుఁగున టెక్కరాయఁ
డుదిరి వెన్నెలగాయంగ నొప్పుచుండె
మందకతె వేల్పుచే గ్రోవి మరులువుట్ట
గాణతన మచ్చు పడఁజేసె గరితగుమికి. ౯౫

వ. ఇట్లప్పల్లె మచ్చెకంటుల యుల్లంబు లల్లుకొని పెల్లురేగి
తమకంబు వెల్లివిరియఁ బాడిన గ్రోవి రవళికి మేనులు
పొంగి చెంగున నిండ్ల ముంగిటిచోటుల నీటుగా నిలిచి
నిలువంగాక తమచేతిపనులు విడచి పరుచుఁ బూఁబోఁడు
లేమగడ నల్లనయ్యగాక యిల్లేల తల్లి చెల్లెం డ్రల్లుండ్రు
మామ మగ లేల నని పాసి కాపురంబులు ద్రోసి యడవి
తెరవుపట్టి యొకళ్ల నొకళ్లు చెప్పరింపక మచ్చరించి మొగం
డుచ్చిపార కోలవేయు దారి దరియెఱుఁగక కట్టుచెరుంగు
లూడములు కంప జొంపంబులం బెంపగు పొదలగుంపుల
కడ్డంబుగా దాటుచుఁ బాడిన పాటచోటు సూటిగా రాటంబు
నం బోయి తన్నుడాయ నమ్మాయలాడు తాయిలారా
బోయులీప్రొద్దుదాక రారే కడఁలిని రెబ్బెవ వత్తురే కద
సత్తులరమర లేక తిరుగు నీసరిప్రొద్దున నెమకం జనుదెం
చితిరే చాలుచాలునని పలికి మఱియు వారు వచ్చిన
ముచ్చటల మచ్చెకంటులవలనఁ దెలిసి మెలపులేనివాఁడ

పోలె పాలుమాలక నేటికోలి మని యుగ్గడించి గీటునం
బుమ్మచు నిట్లనియె. ౯౭

చ. పడఁతుకలార పిల్లలను బంధుగుల న్మగల న్మఱుంగుల
న్విడదటి వెగాసవచ్చితిరె వేమక కాఁచులగూఁ కుటుంచలం
బొడమిన నొండొరుల్దెలియఁ బోకలఁబోకురె మేరదప్పి పో
నడుతురె చాలుఁజాలుఁ దగునా ఋటువప్పులాపులి కారుచున్ ౯౮

సీ. అమ్మ యెటింగిం ద్రిమ్మరి యని తిట్టు
నత్తకుఁ దెలిసిన మొత్తిడుచుఁ
దోడికోడలు విన్నఁ దూలించు నగతాళి
మామ జాడంటినఁ దామసించు
నక్కసెల్లెండ్రు గన్నప్పుడే కాదంటు
రెవ్వరుగాంచిన నీసడింతు
రౌడయని మదినాట నెడఁ దలఁ గోరిగించుఁ
గావపీడిది గన్నఁ గిలఁత వెట్టు
గీ. మగని బారిఁబడిన మఱియేలుకొనఁజూడఁ
డన్నఁ గన్న నాతిసపుడె త్రోయు
లంజెతనము మేలె సంజిలిపడనేల
మూందు మొదలఁ దెలివి మోసపుచ్చి. ౯౯

మ. పులులుం దుప్పులు నిండియున్న యడవిన్ బ్రాముప వేవెల్గురా
కలనిట్లీసరి పొద్దువచ్చితిరి కాలాక్రాల్గొట్టుచు న్వ్యాజులై
తెలిసెన్ జక్కనఁ బోవు డిండ్లకడల న్దెల్వొందియుండుండు మీ
వలపుల్దీరుతు నిట్టిసేఁత దగునే వాల్గంటులా రాయనన్.

శా. ఆపూర్వంబోఁడులు లంపటంబడుచు నాయంబౌనె యిట్లేగఁగం
చాపంబిడ్డలుబంధులున్నగలు మీకడ్డంబె పోండంచుఁ జే
రేపన్దాపుల మోపు తేరి దారపేరెంబెత్తి సిగ్గేది నా
మీపల్లెవ్వడ వాఁడఁ జూపెదవు మేలే దిక్కువేగున్నదే ౧౧౧

చ. తగులము లెచ్చటంగలవు తాత బళా తనకూఁతుఁ గోరఁ డే
జగములు మూఁడునేలు దివిసామి తమిన్జడలయ్యె పైదలి
న్నగిలెనుగాదె చందురుఁడు దాపక మాటలనేటు కానిదా
మగువకుఁ జూలొనర్చె వెఱమాని తగుల్చరించెఁ గానపే.

ఉ. పిల్లనగ్రోవి మ్రోఁత మను పెద్దగుమక్కువఁ జెందఁ జేయ నే
పల్లియదాటి సస్వయఁ బొల్పడివచ్చిన మమ్ము బొమ్మనం
జెల్లునె యేలుకొమ్ము మిముఁ జేరితి మింటికి మళ్ళిపోవఁగా
నొల్లము పెక్కులేల చనువొప్పఁగ నేలుమటన్న నెన్నఁడున్.

కం. కొంచక వచ్చిన వీరల
మంచిదియని కలయఁగాదు మఱపించెదనం
చెంచి యటుసూడ మరుగై
ముంచె మరులఁ గడలిలోన మునుకొంచు వేడ్కన్ ౧౦౪

గీ. అదియెఱుంగక పడఁతు లయ్యడవిలోన
నడలు దఱిమూట్లఁ జాలక యలయుదాక
తిరిగి వెతకుచుఁ గన్గొను తెరవు లేక
పిలిచి కూకలు వేసిరి బిగువు లేక. ౧౦౫

సీ. వెనుతాడి మ్రోఁగఁ బిల్లనగ్రోవిఁగలవాని
గాఁడింబ పోఁబంచెఁ దాల్చువాఁడఁ

బాఁగడఁ దామరచేకుదెగడు కన్నవవాని
గురిగింజ తల నెమ్మికుచ్చువాఁడ
బొన్న చెట్టా నల్లవన్నె మేఁగలవాఁడ
గలిగొట్టు వాపసిఁ గాచువాని
గోరంటరొమ్మున గొప్ప మచ్చఁగలాని
వాఁవిలిచే జుట్టువాలువాని

గీ. యడవియందునఁ గానరాయనుచు గ్రమ్మఁకు
గ్రమ్మఁకుఁ బొదపొద నట్టున ట్రాకు నాకు
నడిగి వేసరి కలివాఁకయండఁజేరి
దండితెగువల బలువగఁ దగిలివిసివి. ౧౦౧

వ. మఱియు నాతొలివేల్పుకంటువు పయింగల్గు కూరిమి నేదారినెఱుంగక చిలుకలకొలుకులెల్ల నొక మాటమీఁద నిట్లని పొగడిరి. ౧౦౨

కం. నీవీ పల్లెంబుట్టిన
చేవంబెను పొందె మందచేటులుఁగక మ
మ్మోవలఱకు నేలి విడచినఁ
బోవుదుమే చచ్చి నిన్నుఁ బొందక కృష్ణా. ౧౦౩

చ. చనుమొనలంట నీయడుగుసాపు చుఁబొందులవింత లేర్పడ
న్ననుపుము మానితే వినెడుమాటలు లేవిఁక నీదు చెయ్వుల
న్బనుపుచు గుట్టలన్దిరిగి బాయుట లూపిరిస త్తెమల్లు నీ
గిన జవరాండ్ర పెన్కొలల కీనులు నీకగుఁ జూడు వెన్నుఁడా

గీ. విసపుదారివలన విసరిన సుడిగాలి
రూపువానివలనఁ బాపమేని
వానివలన, ఆలవాన పెన్జడిదెబ్బ
వలస మనిచి మరుసిబారి విడతె. ౧౧౦

శా. నీచే సోకుడు లేక పూవిలుతుచే విల్వ్రాఁగ లేమింక వ్రే
రాణా! రా కనుదమ్ముక్రోపులనుముగా రారాపుసేయుంపుమిం
కే చాయుంగన లేను క్రోపు దరిదికే-నీవు తాళంగలే
మీచామల్లను వారెవి మతకమే లే జాగుబాగేహరీ. ౧౧౧

మ. తొలి నోము ల్గొనసాగెఁ గానకగుగం దోరంపువేడ్క-న్నిను
ల్దోలకన్గూశెదవంచు వచ్చితిమి మాదోసంబు మోసంబు తె
ట్టులో మాకప్పనసేయు కీయడవి చెట్టుంగుట్టులం డించి రా
వలఁతి నోప్పుదుమే వెఱంగొతుక మాహాగుట్టు మిట్టాడఁగ కా

సీ. పెదవి తేనెలొసంగి బిడెమువోఁ జేయరా
కౌగిఁట బిగియించి కదియరార
చను మొనజ్జవు కెత్తఁ బిగిగొని మనుపరా
పలుగంట్లఁ జెక్కుల నిలికొనర
కన్నులు ముద్దాడి కవితనం బునుపరా
నెఱుల విరుల దండమురిమి చనర
మొగమిచ్చినను మంచి ముచ్చటఁ దేర్పరా
మరుగంటి చేతులమాటి కొనర

గీ. యనుచు మరుపూల తాకుల నలఁతఁబడుచుఁ
జేడెలెల్లను జోహారు సేయుచుండఁ

గనికరము మించి నల్లయ్య గానుపించె
వగచు పడఁతుల ముందఱ మిగులకూర్మి. ౧౧౩

కం. వచ్చిన వెన్నుఁ గన్గొని
మెచ్చుచు సంతసముతోడ మేనులు వొంగం
ముచ్చిరుట వెడలి మొదలం
జచ్చి తిరుగఁ బొడమినట్టి చందం బల్రెన్. ౧౧౪

సీ. పలుకరించని దేలపలుకుదు వనెయొకర్తు
మోసగాఁడని దూరె ముదితయొకతె
చులుక సేసితివి గచ్చుల గాఁడయనె నొకర్తు
పిన్నసేఁతలు బెక్కు లెన్నె నొకర్తు
పారిపోయిననుఁ దప్పదు రాయనె నొకతె
యాగాపరికి వెఱ్ఱియనియె నొకతె
తప్పేమి? యలిగి పోఁదలఁచెదవనె నొకర్తు
వలపించి తొలఁగు టొప్పదనె నొకతె
గీ. పలుచెలంగుల నిట్లనిపలుకుచుండ
వినని యట్టులవాగల వెతలడంగ
నందఱకు నన్నిరూపులై యపుడుమెలఁగి
వేల్పుగుట డెందములఁజిక్కి విసువులేక. ౧౧౫

వ. ఇట్లా చేడెలుందాను గోడిగంబులాడి చూపుల కూడికల
వేఁడు మాటలసూడిగంబులసూడిగంపుసేతల పోడిమలనీడు
జోడులేర్పడ నిండుపున్నమ గందు వెన్నెలల బయల్లో
మొయిళ్లనంటిన మించులవలె నంచయానలంటిరాఁ దిరు

గాడి కప్పురాపగడంబుల సరిగూర్చిన పేరులోనా నొక్కొ-
క్కయువిధ కొక్కండుగా జతపడి యేర్పఱచిన దొడ్డికట్టు
వడిబోద్దునఁ బిల్లఁగ్రోవిఁగో మెల్లనఁ బాటఁబాడుచు నిలిచె
నప్పటివారి వేడుక లెట్టివారికి లేవయ్యెనంత ౧౧౬

చ. అలసితి మాటపాటలఁ బిడాతవిఁగోఁ గఱివాఁక నీటి...
మెలఁగుదమంచుఁ గొమ్మలును మిఱ్ఱగు ఖానలు సీతకొయ్యలు
నెలఁకుల దాపరించుకొని కేకలు వేయుచుఁ జేరియొడ్డుపై
వలువలు పిల్పియుందఱు గబాలునదూకిరి నీటిలోపల

వ. చెలరేగి తిరుగులాడుచు ౧౧౭

రగడ. కలికి గులగులబోయెదవునిక్కంపు మెఱసళుల తావు మల్లెము
జిలునఁబుప్పొడిఁగన్నులంబడఁ జిమ్మకుము తామరలసల్లము
యువిద పదరకుమి చెటవాలుగులొప్పుమడుగిది తూరిపఱఁబడుఁ
బనులు బోవిరిసినవి కలువలు బంతిఁగూరుతు దెమ్మె వలపిడు
ముగుదముందఱ నాచుతీవెలు ముసర సందీదాడఁ బోవకు
తొగరు కెందలిరాకుచాటున దూఁగునం చలపిందుబోవకు
చెలియయల్లదె కంటివా? కొడిచేతివాలుర పెద్దకొక్కెఁగ
పుంటకు పులుకునఁ జేపపిల్లలఁ బొడుచుచున్నది తేపకొక్కెర
పడఁతి! చూడవె తెల్లమబ్బులు పండగిలఁబడి నీటునిక్కుచు
సుడులబడి గిరగిరగఁదిరుగుచుఁజొక్కె నావలఁబోవనిక్కుచు
తెఱవఘోమ్మనసీరు నాపై దిట్టవని చిమ్మెద వయినుమడి
తెరలకుండగఁ దిరిగిచిమ్మెనఁ దెప్పరిల లేవెఱఁగి కొనుబడి
బుడుతసామిఁ బనఁటి యీఁతలఁబోయి ముట్టెదఁ జూపుమి త్తెఱి

గడఁగి వాత్రోఁ జలముసేసినఁ గాలఁ ద్రొక్కుఁడు మిడుకబిత్తరి
యానుచుఁ బైదలు లీనులాడఁగ నలరి వెన్నుఁడు వారివెంబడి
చనువుమీరఁగ నీటిలోఁబడి జల్లులాడె మరుద్గుల్పడి. ౧౧౯

వ. ఇట్లు కొంతసే పప్పాల తెప్పలందేలి యొప్పుల కుప్పలుం దానును ముప్పిరిగొను వేడుకలం బహుతెఱి లిబ్బులబ్బిన సామిబంటు కొంటెతనంబున శంఖచూడుండను వాఁడు కొమ్మలలో నెమ్మిగలవారిఁ గొందఱఁ జిందరవందర సేసి యెత్తుకొని జరుగఁ గురంగటనున్న వెన్నుండు వెన్నాని యురికి యోరి పిరికి మొఱకుతనంబేల ప్రేఁతల నాఁగుట మానుమనిన నా జక్కులయ్య కూరిమి బంటు కంటగించి యెకుఱై పదరిన వదరకుమని నల్లనయ్య బల్లిదుండుగావున నెల్లిదంబాడి బాడిసెలంబోని తన వాడి గోరుల వానిఁ జీరి కూలిచి డీలుపడకుండని చానల నందఱఁ గూడం బెట్టి యిట్లనియె. ౧౨౦

గీ. మిగుల నిప్పుడు వచ్చిన మేలటంటిఁ
గాని మీయిండ్ల కడకేగి కాపురముల
నుండుఁ డేఁగోరినప్పుడు దండఁ జేరి
వలపు గడతేర్తుఁ జనుఁడన వార లరిగి. ౧౨౧

గీ. గీములఁ బరుండ మగవారు కీలెఱిఁగియు
మారుమాటాడకుండి రమ్మాడ్కిఁ జరిగె
కొన్ని నెలలంతఁ గంసుని కోర్కెఁ దీర్ప
వచ్చు రాకాసిమూకల ప్రచ్చుటెఱిఁగి. ౧౨౨

కం. వేలుపులు గుంపులై సిరి
నేలెడి దొర గాక మాసియే కృష్ణుఁడటం
చోలి గుజగుజల ముచ్చట
పాలై రిత్తెఱఁగు జరుగుబడిగాంచి వడిన్. ౧౨౩

వ. కంసుని తొలుతఁ బంపుడువడిన వారిలో వాఁడుగావున

సీ. కుఱుచగట్టెలఁ ద్రొక్కుడుఱువడి మనుగాడఁ
దోఁక ద్రిప్పుడు గాలి ద్రోఁకు లగలఁ
చికిలింపులను కొల్ల చెడెలఁగాఁ జూడఁ
గనుఁగొలంకుల నెత్తు రినుమడింప
జూలు జాడింపులఁ జుక్క లురిలి రాలఁ
బలు గొఱకుడు చప్పుడులు సెలంగఁ
జుట్టుపేరెంబుల గట్టులిట్టటుదూల
ముట్టెత్రోపులఁ బసి మొఱలు మీఱ

గీ. మందపైఁ గేశి యనియెడి మడియతట్టు
రూపు సెలవొంద గంసుని ప్రాపు బలిమి
వెన్నుని నడంపఁ జనుదెంచి వెఱ్ఱిపీగు
టరసి పరువెత్తి రెల్లఱు నచట నిలక. ౧౨౪

ఉ. ఈసున రక్కసుండు మడియించు తలంపున వచ్చుటప్పుడే
రోసి యశోద బిడ్డఁడు గురుల్గొనగమావిన నెత్తగట్టి రా
కాసి వెఱవ్వడంతు పసిగాపులపైఁ దగ దీవు వోవఁగాఁ
బాసిన నడ్డపెట్టి జముపాలికిఁ బంపుము రమ్మటన్న చోన్.

ఉ. వాఁడు గిరుక్కున న్దిరిగి వాడలచేడెలత్రోడ బింకము
ల్యాడుటగాదు చిక్కితివి ప్రచ్చెద సిగ్గని వెన్కడెక్కల
న్గాఁచ మొగంబు దన్ని తిరుగ న్గరవ న్గమకింప వ్రేల పి
ల్గాఁ డరచేత మొత్తె నొస లాకసమంటి   కుక్కనన్బడన్.

ఉ. వెంటనె లేచి వాఁ డులుకవేదురనా   ంసెత్తింగి ము
క్కంటిలకోరి చేనాడిసి గట్టిగ డాడల గ   శిఖట్టి ము
క్కంటగ జక్కనంబొడిచి యూతవినుం   బీరమారి క
న్గంటల నెత్తురుబ్బబడిఁ గూయుచు సొమ్ములు ముఁ   వఁ గూలెఁ దాన్

వ. ఇట్లు గూలిన,

గీ. గొంతుకోలు ద్రొక్కి హూర్పుండి యూపిరి
తాపిరించ కుండఁ తల బిగింపఁ
గడుపు దోసపండు గతిఁ ద్రిప్పి లోగాలి
వెడలిపోయె మేనువడియె నచట ౧౩౦

చ. అదిగవిగొల్ల చేడియలు హా బలురక్కసుఁ డేగుదెంచి ని
న్బ్రదవి మదంబుదక్కి పడి పోయె నెఱింగితి మీఁవు నేల వే
గదుమట కీకటన్బ్రడమి యాపులగాపుల మమ్మ గాచునీ
మొదలిటిరూపదిట్టిదని ముచ్చటలాడ నెఱుంగవచ్చునే?.

వ. అని కొనియాడిరంత.

సీ. ఒకనాఁడు తెరగంటి యొకిమీని పనుపున
జగడాలదిండి విజ్ఞాడిగి
పుడమిని మదిరేలోఁ బాలుపొందు గిన్నె పే
రిటిరాచయింటి వాకిటిబయల్గ

నిలబడి మొగసాలఁ గలవారి గనుపించు
కొని తనరాకడఁ బనుప వాతఁ
డంతిపురమునుండి యరుదెంచి కాళ్లు
మరిలచి లోఁజేర్పఁయడుగఁ జెప్ప

గీ. మందలో రామకృష్ణులు మనుట నీదు
పంపుడుల మాట కేగిన బలియులైన
పొలసుదిండుల బడియించి వెలయుచుంటఁ
జెల్లెలికిఁ బుట్టు కూమంద్రఁ జేరుటయును. ౧౩౩

కం. వినుమింకొక్కటి దెల్పెద
నినుగూల్పఁదలంచినాఁడు నెరవరియైన
న్ననుముటకు ముందె తగునం
తనకాషరసికొనుమనుచుఁ దరలె న్నివికీ. ౧౩౪

కం. ఆయన పోయిన పిమ్మట
నేయనువున బ్రతికెదనుచు నెంతయువగలం
పోయిమఱచి మరిదెప్పిరి
పోరెం బెద్దయ్యే మేడపొంతకు వడితోన్. ౧౩౫

వ. అట్లుపోయి యాయనంగని నీయాగడంపు సేఁత లెఱింగితి
నెఱుంగని వాఁడ పోలియుండి నాకావు నీవయొప్పితి వప్పు
వని నమ్మరాదని జగడించి తెగడి మొగసాలసావడి లేవ
డిగా నీబడుగు మునుక సినుపగొలుసుల సంకెలల బిగియిం
పుండని తన నమ్మిన బంటులం గ్రమ్మించి చెలియలి
మఱంది నట్లనే కస్తిపాలుసేయించి గట్టిబిగదులగు జట్టుల

రావించి నట్టువసాలఁ గాపురంబుండ నియమించి తనయుంట
నున్న కోరకొమ్ముల మొకంబు దెప్పించి యామిందటి గుమ్మం
పుటోర నిలువఁగట్టించి తక్కిన నెచ్చెలులనెల్ల రావించి.
వారితో మంతనంబునఁ గావిన్నదతయుఁ దెలియం
జెప్పియుఁ గాపుగా నుండుండని చెప్పి తగుమంతురులతో
సలిపిన మంతనంబున నొకయుపముఁ గల్పించి సింగాణి
జన్నంబు సేయుదు మేతెండని పిన్నపెద్దలందఱుం గలసిరాఁ
దోడుక వచ్చుటకై సంపుపల్లెకు క్రూరండను బంటుమాటిసిం
బిలిపించి యతని కరదంబు బూన్పించి యుబ్బి యనిపె
నంత యతండు ౧౩౬

గీ. పోయివచ్చెదనని రాచపొంత విడచి
క్రుంకుమెట్టకుఁ బచ్చని గుఱ్ఱపయ్యి
జరుగునంతకుఁ బల్లియ సరస కరిగెఁ
దోడుకు కాల్దువ్వదనుముంప దూగి నడచి. ౧౩౭

ఉ. త్రోవనుబోవుచుండి మదిఁదోరపునెమ్మివొసంగఁజూచుపె
న్దేవరగొల్లవాడ బడి తెంపరి జచ్చినమూకవాసగా
నే వివరించునో తొలఁగు నేరుపు లేకిటు వొమ్మటన్నచో
నీవలకేగుదెంచెనని యెంచునుపెంచునొయల్కనాదెసన్

చ. మయిదునఁజావమొత్తఁబిలుమంచుననంపెడి చోటనాతుని
మ్మొయిఁ జనఁదీరదంచుఁ బెరిమందెగజెప్పకనిచ్చకంబుగా
మొయికొనుటన్ని పోకలకు మెక్కవ దళ్కొనెనింకనిక్కము
న్గయికొనకాడిదబ్బరలుగాంచుదునొట్టులు మేలుచాలొగిన్

గీ. అనుచుఁ దలపోసి నిజమూఁడి యచటఁ బ్రతుకు
దనుచు నిబ్బరమంది నల్లయ్య యింటి
ముందఱ రదంబు డిగ్గిన ముచ్చటరసి
జాగుసేయక తపోసె జరుగు ఘనులు. ౧౪౦

ఉ. పలికపంపునం బిలువ నెక్కుడు బత్తుఁడువచ్చివాఁకిట
నాలిడె మేలెదుర్కొనెదఁగాయని వెన్నుఁడుపిండుకూఁరిమిం
వ్రేలును దానుబోయి సరవి సద్గుమన్ననగారవించి ముం
గోలున సేమమారసి మొగుప్రోదమించుమెలుంగుతోననున్

ఉ. తాత పితామహులేక కాఁతల్లిగద్రావి మెలంగుచున్న వా
డే తలిదండ్రుఁలు లేమిచిరి యీవిటువచ్చుటెఱింగి మామమ
మ్మిత్రతటినేరిచే నెఱిఁగె నిక్కడమంచుట తొంటివోలనో
లాఁతి నడల్పడిల్పి మఱిలగ్గుఁదలంచెనో తెల్పుమంతయున్.

వ. అని నెయ్యంపుమాటలాడు జెట్టువాల్పట్టు దొరతోడ

సీ. అక్రూరుఁడిట్లను నయ్య గుట్టాడుదు
నెవ్వరు వినఁగూడ దింతవట్టు
సింగాణి జన్నంబు సేయుఁదు మిందు రాఁ
బిలువుమంచంపె నజ్జ దులువమామ
చేటెఱుంగఁడు మిమ్ము చెఱుపుతలంపున
నానకు వెఱచి యిల్లేను వచ్చి
నాఁడఁ గుచ్చితుఁడ మంగాడి నన్నడియించు
మీ దోసమడగించి మెలమినేగి

గీ. పగతుఁబోరిగొను ముని కాళ్లపజ్జ వ్రాలి
విన్నపముసేయఁ దిలకించి వెన్నుఁడపుడు
మన్ననల గొప్పజేసెఁ గానున్న తెఱఁగుఁ
దెలిపి లోఁగల దుడుకుఁబో నులిమెఁగడక. ౧౪౪

కం. నడురేయి జరుగ నిదురం
బడి వేకువయగుట లేచి పల్లెయవారిం
బడవాళ్లఁ బిలిచికూరిచి
వడి మదిరెకుఁ బోకఁ దెల్పె వారలకెల్లన్. ౧౪౫

వ. అంత, ౧౪౬

చ. అలిగినముద్దరాండ్రఁ గలయ న్మగలన్నలు దాటరేగువా
రలు పయినంపు వేడుకలు రట్టులొనర్పఁగఁ దాపసుల్మదుం
గులుగొని యేటికయ్యలకు గొబ్బునఁ దానములాడ గుర్తుగా
నలువదగిల్పెఁ దూర్పుదెస నాఁగనుజొప్పడె వేగుజుక్కదాన్

ఉ. బాపలుఁ గాక రాదారకుఁ బట్టిన దోసిటనీకుసల్లఁగా
దాపిడియుంచుఁ దెల్పుగతి దారసిలెన్ద్రోలుఁదోట్ల నెట్టసౌ
ధాపున పిచ్చుకుంటి పొగరుందగు వెల్గులువానిఁజూచి గొ
ల్లాపెలు నల్లలమ్మఁ దల మనాపుదురోపి కెబుంగబానలన్

ఉ. మిక్కుటమైనహూఁతలను మేఁగడునిక్కఁగమూఁడుదారులం
గొక్కరొకోయటంచుఁ బులుగూరిచికప్పినచప్పరాలపైఁ
జిక్కులఱెక్కలంబఱచి చిప్పుచు నెవ్వడిఁగాలిగోరులన్
నిక్కి దెసల్గనుంగొనుచు నేర్పుగఁ గూసెను గోడితండముల్

సీ. చీకటియను నేన్గుఱుచు పెన్సింగంబు
జక్కవకవఁ గూర్చు జాణకాఁడు
పగలొనరించు సూర్యుదుల చేతుల వాఁడు
వేల్పులమ్మకు ముద్దు గొల్పువాఁడు
కుఱుచకోరికెల సోకులమూక పగవాఁడు
పదిరెండురూపులఁ బరగువాఁడు
ఏడుగుఱ్ఱముల తేరెక్కెడు మరకాఁడు
కఱ్ఱివాఁకయన్గాఁతుఁ గన్నవాఁడు
గీ. పొడుపుగుబ్బలి నిచ్చలు పొదలువాఁడు
గుదియదాలుపు కొడుకుపైఁ గూర్మివాఁడు
వడకు తెవులంటు బాపెడి యొడలివాఁడు
చదలుపూనిక మగపడె మొదటిచక్కి. ౧౫౦

ఉ. అంతట నల్లనయ్య తనయన్న నెదుర్కొని ముచ్చటించె తా
మ్మింతకు వచ్చెదే మదిరయిక్కఁగఁ బెన్గనున్న తల్లిని
న్వాంతలఁ గూరుతండ్రిఁగని వారలు సంతసమందఁగం సున్నిం
తింతలుగాఁగఁ జెండి పగఁదీర్పఁగఁబోవలెనంచు దందడిన్.
కం. వ్రేపల్లె గొల్లవారికి
బ్రాపై దొరతనము నెఱపు బలియుని నందు
న్గాపై రమ్మని తరలెను
దాపలనల్లయ్య నడువ దళవాయివలెన్. ౧౫౧

వ. ఇట్లేగుతఱి గొల్లచేడెలుల్లంబుల వెల్లిగొను తమకంబున
గళవళింపుచు మదిరెనండి యొక్కొక్కళిబంటు వచ్చి

సరిప్రొద్దు జరుగుదాఁక గుసగుసజేసి వెన్నునిఁ గదిలించు
కొని పోయెదుమని తిట్టుచు మరలి చనుదెంచు నంతకు
నూపిరి బట్టుదమని గుట్టుమీఱక యుండిరవ్వల,

ఉ. వచ్చినతేరుపైఁ బసిఁడి వల్వయుఁ దెల్లని మేఁగలారలన్
మ్మచ్చికనుండఁజేసి పలుమాటలసందడి వచ్చి త్రోవలో
నచ్చపుబత్తిఁబిల్చి దగఁనాదటఁబాపుకొనంగ వాఁకఁదాఁ
జొచ్చి కనుంగొనె న్నిగుల చోద్యముగా నటనన్నదమ్ములన్

గీ. తేఁకమీఁదివారు తెరలి యిచ్చటికెట్లు
వచ్చినారటంచు నిచ్చఁదలఁచి
మరలిచూచి కనియె నరదంబుపైనుండ
నబ్రమనుచుఁ బొగడనయ్యె వారి. ౧౫౫

వ. అంత నక్రూరుండు వాఁకయందేగాక యరదంబుపైనేగాక
యేదెసంగన్న నాదెసఁ బొడకొన్న గుడుసుపైకెనువుఁ
జోదుం గుఱించి హత్తిన బత్తి నిట్లు వలికె. ౧౫౬

## చూర్ణిక.

కంటిఁ విన్కలి దంటనెంటినంటి తొంగుండు తమ్మికంటీ- మిఱ్ఱు
లేని మఱ్ఱాకునఁ దోఁచి నఱ్ఱాకిన కుఱ్ఱా-పాలమున్నీటి తెలిదీవి
కెలన నున్న బంగరు కోటగల వెలిహజారంబునఁ గొలు
వుండు మన్నదొరా-తీపిగణుపు సింగాణిరాతు గన్నయ్యా-
కన్ను లీకలపురిఁదల డిగుగు నమరించిన సెట్టీ- వలమురి గును
నువాల్గుదెవిబ్బురీకత్తి నాలుగు చేతులఁగల జెట్టీ-కోరకొమ్ము
మొఱనఱక లేక విని కరకరి నీటి తిరుగుడు మెడ నూడనడఁచిన

తండ్రీ-తొలిపలుకులు దొలంగించిన రక్కసితేని మక్కెలిఱిచి
చంపిన చేఁపయొడలిపోఁడా - కడలి మునిఁగి పొడవడఁగిన
మల మేబలుపున నిలువరించిన వెన్నుబొచ్చె నమరు తామేటి
మేటీ - ఒంటరివై పైఁడికంటి కంటుఁబంట గెంటి మంటనెత్తిన
సామీ - యరమానిసి యరతెర నోటిమెకంబైన మేఁబూని
జేజేలసూడు గోరుల ముని మాపునజీరిన వెరవరీ - పొట్టివై
దిట్టరక్కసిదొరఁ గట్టిగా మూఁడడుగుల పెట్టు పుడమి నడిగి
కొని వాని నడుగున నడఁగఁ బట్టించితిర జగతులు వేల్పు
రాచ కప్పనసేసినదిట్టా-చుట్టువాల్దేవర మారురూపురాచతో
మొదవుకై జగడించి నేలఁగూల్చిన జన్నిగట్టా - పుడమి పట్టి
దొంగరాకాసి పది గొంతులు దరుగు కొఱకఁ గడలి కట్టఁ
గట్టించిన రాచపట్టీ - యేనెఱింగితి నిపుడు తాడి పులఁగు
సిడెంబుల దొరవై వెలసి మందజెందిన-చావుసుందు చంటి
పడఁతి-సుడిగాలిరాకాసి-కొక్కెర-చిలువ-దూడ-యాఁబోతు
గుజ్జుపురూపు నల్లద్రాగుడుల మడియించి మించిన నల్లనయ్యా
మ్రొక్కులు గైకొనుమని పొగడిన సంతసించి - వెన్నుం
డా బంటుమానిసికి - గెంటని విన్నాణం బొసంగి - చెలిమి
వొసంగ మన్నించె వెండియు, ౧౫౮

మ. ముగురొక్కప్పుడె తేరిపై మదిరెలో ముజ్జేరిరాఁ ద్రోవరా
సొగసుల్మీరి మిటారులూరి పడుచుల్పెద్దెంబుగా గుంపులై
జగతు ల్మిద్దెలు మేడలెక్కి కని రోజంబూలు పైఁజిమ్ముచున్
నగువాల్జూపుల పంజు వందనియఁగా నల్లప్పనిం బాడుచున్.

వ. ఇట్లు సూచిచూచి తనివి సనక మఱి యొకరి కొక రిట్లని
చెప్పం దొడంగిరి. ౧౫౯

ఉ. గొల్లల పల్లెఁ జేరి చనుగొండలచేఁ దగునంజుడాను నీ
పిల్లసిరొమ్ము సేర్చి చనుఁ బెట్టినవాతెగ బీల్చి చంపెఁ గా
లెల్లడఁ బర్వ వచ్చు పొగ జేచిన రక్కసురూపుమాపెఁ బె
న్నల్లల పీల్పులం దురమున న్మడియించె నటంట వింటిరే.

వ. అదియునుంగాక,

గీ. వీఁకఁ బిడ్గొంద సిక్కంపు వెలది వెలది
వీఁ వీనాని నాతఁడు వేల్పు వేల్పు
జోదులీడైన పడఁతికి జోదు కడుపు
దలఁప నబ్బంబుగాదు పెక్కు లననేల. ౧౬౨

కం. అని పెక్కువగలఁ బలుకుచుఁ
దనివిసనక చూచి మరలఁ దాదాపైపై
గొను తలఁపుగదుర నచ్చటి
మునుమునఁ దమి నిలువలేక ముందఱ సనుచున్. ౧౬౩

మ. జతలై గుంపులుగూడి యాడుకొనఁగా సైదోడుతోఁ వేలసం
గతిఁ బూఁదోఁట వసించి మాపుకడ రిక్కంబొల్చు పేరింటి సి
బ్బితఁ బెండ్లాడు బలుండు దానుబురి జెల్వొంజూడ వేంచేసి ముం
జతనంబొప్పఁగ రాచపచ్చడములం జాడించు చాకిం గనెన్.

మ. దొరకల్గుం బ్రదముమ్ము చివల్వలిడు మెంతోఁ గూర్మి మేలయ్యెడిం
జిఱుబుస్సాడిన కీడుదప్పదనిన జ్జేయెత్తి బిట్టల్క వా

డెలు కన్గొల్కులఁదోప నిట్లనియె నింకీమాటమూ రాడిన
న్దరిదాపయ్యెడి రాచవారువిని పంతంబేల పొమ్మ్మోరకా.

గీ. కలుకు బిరుసుటాన గలవాఁడు చుట్టల
నృనికరంబులేదు కర్జమెటిఁగి
యొదిగిదాటుఁడన్న నొదవు రోసంబునఁ
జావమొత్తెఁ గైనిఁజాకివాని

కం. అదిగని తక్కినవారలు
బెదరునఁ గోకలటువైచి బిరబిర నురక
నదిరెడి వేడుకముడిగల
మది కెక్కిన వలువలంది మరలెా హరిదాా. ౧౬౭

సీ. పూలమ్మ్మవానింటి పొంతనిలువ నాతఁ
డెమరుగాఁ జనుదెంచి యురవుఁ జేర్చి
యడుగులుగడిగి కాత్డిఁ దల నమరించి
యేమంటి నినుగంట నిత్తటినని
కైవారములు పెక్కుగావించి వలసిన
పూదండలర్పించి బుజ్జగించె
నాతనిఁ దనవారియం దొక్కనిగఁజూచి
కమ్మ్మరి త్రోవలోఁ గాంచుటయ్యెఁ

గీ. గలపములు రాచవారికిఁ గాఁగఁగూర్చి
వెండి బంగారుగిన్నెల నిండనుంచి
నగరిదెస కేగు వంకరనడలదాని
యొడల మువ్వంకలొానరిన బసగుదాని. ౧౬౮

శా. పాట్రీ కమ్మని గంధమిచ్చెదవె నిన్వొంకంబుగా జేయుదున్
బెట్టుఁజల్లాపిసఁ గూల్తునన్న నది యబ్బెన్వామితోఁ జెల్మియుం
చెట్టోవల్కక । మొక్కియింటికరుదే నెంతేసిఁ గొండాడిరాఁ
బట్టెన్స్వామినిఁ గ్రొత్తరోపెరిమ మొప్పన్ జేఁడు లేల్పుండినన్

ఉ. వంకరకన్నెఁ జక్కవలుపం దలఁపొందిన నట్టు కాఁడు నా
కొంకికి రమ్మటన్నఁ జని శేవ నెదుర్పడి చేతులెత్తి ము
వ్వంకలు దీరగుంజి పిదపం దగు సేఁతలబుజ్జగించి నే
బొంకుట లేదు నిన్నరలఁ బొందెదఁ గర్జము దీరఁగొద్దిలోన్.

గీ. అనుచు నల్లయ్య దెల్పిన నంతనడియు
కొంద నూనామిమీఁద నే పొందుపఱచె
నంతనట లేచి వేయంచు లమరుకైదు
వూనుదొర రాపవాడ కేం తేని నరిగి. ౧౭౧

సీ. గోడలఁ జెక్కిన గోనబు బొమ్మలదాఁకఁ
బచ్చరాజగతులఁ బరగుదానిఁ
బటికంపుగట్టిన బరగుముంగిటిదానిఁ
గెంపులచూకుల సొంపుదాని
మానికంబుల గూటి మట్టంబుగలదానిఁ
బులుదిండి దూలము లొప్పఁగుదాని
ముత్తెంపుముగ్గు దళ్కొత్తు నట్టిలుదాని
బంగారు గడపల రంగుదానిఁ

గీ. గైదువులు నంపపొదులు సింగాణి జతలు
మోటకత్తులు బల్లెము లీటె కఱ్ఱ

లనువుపడగఁ బెంజాతరఁ దవరుదాని
వచ్చి నల్లప్ప బొడ్డునావడినిఁ గనిరి. ౧౭౨

కం. ఆసావడి గాపరులను
డాసి వెడఁద వేడిచూడ్కి డక్కొనరిచి కై
సేసిన సింగాణింగొని
దూసి నరం బెక్కొనకు ద్రుంగించె వడిన్. ౧౭౩

ఉ. బెట్టుగ నెక్కువెట్టుతఱిఁ బీటలువాఱి సగంబుతుంటలై
మిట్టి బిరాన నేలఁబడె మేలని యందొక తుంటఁ జేతఁ దాఁ
బట్టి యచాటకున్నవలి పైఁబడుబల్లిదులైన రౌతుల
న్గొట్టెఁ దలల్బరుల్బగులఁ గొంచక నేలికఁ జేరఁబారఁగన్.

సీ. అదిగని కాపువారందఱుఁ బైకొన్న
వెన్నుండు కట్టల్క చెన్నుగుల్క
సావడియందున్న జతనంపు కైదువు
ల్పెళపెళ నుగ్గుగాఁ బెర్చి విఱిచి
దెబ్బకునొక్కని దెసలఁ బారగఁదోలి
యందున్న వెల్ల నుగ్గొందఁజేసి
బట్టతిట్టుల నగ్గిపాలుగా సవరించి
ప్రొద్దుబారెడుదాకఁ బోరుసల్పి
గీ. మీదొరకు నూపిరీపూట మిగిలె రేపు
రేపకడఁ దనుగూల్పక నాపమనుట
లని పతాకను జెందిన యచటివారి
తోడ సెలపిచ్చి విడిదలజాడ నరిగె. ౧౭౫

శా. ఆ శ్రీవేగులవారిచేత విలుతుంబై పోవుటల్వ్యాపడి
నారాకారము సేయుట ల్తనను దుర్గం జేయువేం చేయుట
ల్జీరన్తెచ్చిన చాకిఁజంపుటలు మంచింబోట్టిమున్నించుట
ల్జేరన్సోనులఁ గంటగించి పిలిపించె న్గంసుఁడాగ్గోపులన్.

వ. వచ్చిన వేగరివలన

చ. అదివిని నందుఁడల్కవడి యాపులగాపులతోడ వేగవ
చ్చెద మిది రేయి రామనుట చెంగటి వెన్నుని వీనులాని నో
రదరగ బంటుతోననియె నాచెదుగిప్పుడు పిల్వఁబంపిన
న్మదుగ బిరానవచ్చితి వెమోసముగ ల్గునుబాము మ్మనెమ్మితోన్.

గీ. తెలివిగల్గిపోయి తెల్లవారినగాని
రామటచుచుఁ దెల్పరా యటన్న
వడకుతోడజరిగి వాఁడగ్లు దెలిపిన
నెన్నుమాపటీని కిట్టులనియె. ౧౭౯

మ. మనఃఖుంటుఁగల మొద్దుపేనుగులలో మత్తిల్లి చండామదా
విని గుమ్మంబున నిల్పి గొల్లపిలగానిం ద్రొక్కిమట్టాడఁ బై
కొనఁగాఁ జేయుము వోమ్మటన్నఁజని తాతుండప్పనేర్పొర్పుమా
లిన వాఁడందుదుఃబూనెఁ బాలసుబు తాల్మి న్జెల్మిఁ బాటింతురే.

ఉ. అంతట మానకాయొడయోఁడప్పు డెమల్లులఁ బిల్వఁబంచియా
సంతన దెల్పి యాయితపు సంగడి కాం(డు)రు మీఱువచ్చి విన్
న్ద్రింతుమటంచు వచ్చి సయిదోడుల గొల్లల నేలపాలు గా
వింతురుగాక యన్నబలు వేసుక బల్కిరి వారు నమ్మికన్

చ. పగడగఁగల్గు వేల్పుదొర పాముపయిన్ బవళించు మన్నె బొ
ట్టుగ సెగకన్నుఁ గల్గుదొర డొక్కపసిండిగ నున్న వేల్పు మా
మగటిమి మించఁ బోరునకు మార్కొనఁ బూనిక సేయ రట్టిచోఁ
బొగరున వచ్చు గొల్లలకుఁ బోలునె మమ్ములయింప దేవరా.

గీ. పాలు పెరుగు నేతి బలుపులా మాత్రోడి
సరిపెనంగి బ్రతికి జరుగువారు
గరిడి ప్రొద్దుబోడుపుగాక ముందరసేరి
వారిఁగూల్పకున్న వాసి చెడదె. ౧౮౨

వ. జాగేల పోయివచ్చెదమని చాణూరుండు మొదలైన వార
రుగుతా దొర మెరమెర యడంగక డెందంబునఁ గుందాడ
నింతకుమును నాపనుపున నేటితుదకా మందజేర నెంద
తేని శ్రీదిమ్మరులరిగి పోరి యీపాపలచే రూపుమాసిరి
వీరలీజగంబున నన్నడంచుటకై పుట్టిన చుట్టువాల్సామి
మారుకూపులగుట నిక్కంబు నాసరసకీవర కిరుమారు
మున్మార్లు దూర మోగిరమ్ముగాఁ దిరుగాడు జడదారిచ్చి
యీకతల్ల మొత్తిచెప్పె నాయన మాటవీటిం బుచ్చితి
నమ్మనైతిఁ జెడితి నిదియునుంగాక మొట్టమొదటఁ జదలాడి
నప్పుడు చెలియాలిం గెడప నుంకించినదియె తగవు అట్లైన
నింతవుట్టునుగదా! యత్తఱి నా వెలఁది పెనిమిటి నోటనాటి
వెన్నుండె మైదుపల్కులాడి తప్పించెనోటు? ఐనంగానిమ్మ
రా చత్తొలివేల్ప నీమలివేల్పుచే మడియింపంబడిన నాయన
మొదలి నెలవుఁ జేరెద నదియు మేలు చెప్పరాని కొలలోన

రించిన మొదలింటి రక్కసిమూక లీగుడుసు! కైనువుదొర తోడ జగడించి యెటుకుమొగ్గంబై సమసి యీతని యురువు సేకుటలు విందుమే కదా జళుకొందియైన చుట్టరికంబున నైనఁ బగనైన బత్తినైన నొక్కరూపైన తలంపు నెలకొలిపినవారికి ముక్తిగలుగుట నిజంబని యేదెసనెయ్యది గన్న వెన్నునిఁగాఁ దలపోయుచు సారెసారెకుఁ గొనియాడుచుండె మఱియును.

ఉ. అంతట కన్నుమూఁతవడి యంతనె మేల్కను నంతలోపల
న్వింతలుకొన్నిదోఁచెనొక వేదురుముద్దియ యేడ్పుమోముతోఁ
జెంతలఁజేరి నన్నవయఁజేసుము దిక్కికనీవెయంచు నొ
క్కింత మరుంగుఁజూపి చనియెం దుదఁగన్పడు మిత్తిసత్తియై

ఉ. ఆకలఁగాంచి లేచి కలయం బరికించుచు నింటిముంగిట
న్బోకలఁ బోవుడెందమునఁబొక్కుచునుండఁగ వంగునక్కపె
న్మూకలు నివ్వటిల్లెఁ జెడుగూబలు ఱెక్కలు దట్టిపాఱెఁ బ
ల్లాకులు కేకలందిరిగె గాడిదెగుంపురొద ల్గదుర్కొనెన్

గీ. ఇట్టికీడుగాని సకినంబు లెల్లఁగాంచి
బ్రతుకు టాసనడల్చి రే బట్టబయట
నిలువఁ జిటికెసడల్చిరట్టులను బగలు
మొగము గననయ్యెఁ గాకరా మొలకమించె. ౧౮౭

మ. తొలినాడాడిన మాటఁబట్టి నిదురన్దూగాడుచున్ లేచి వే
ములుగోలంగొని! దొడ్డిలోన వెదుకన్మ్రొక్కరుగా నున్నయే
న్గులలో నెన్మిది చోటులం జమురుకాఁగుల్పొద్దిగా జారు మొ
క్కలినొక్కనుఁగుఁగాంచితెచ్చివిలిపెన్గల్కుందఁగానెల్లరున్

సీ. బుసముక్కు కొనల వెక్కసముసూపెడు దానిఁ
గసగస రావుల మొసవుదాని
సిగిరంబు లన నెత్తి సిస్తుగుబ్బలదాని
నడఁగు ద్రొక్కుడుల రాలెడవుదానిఁ
బలుకొమ్ము దుగదుగ చెలువమ్ము గలదానిఁ
జెటలఁ బోలిన చెవులదానిఁ
జంద్రదనివ్వులో నాఁ బొసంగు కన్నులదానిఁ
గుఱుచతోఁక పిఱుంద మెఱయుదాని

గీ. వేల్పు మన్నె జగంబందు వెల్లగబ్బి
కొలములోఁబుట్టి పుడమి మేకొన్నదాని
మావుటీఁడావె వాఁకేటి తావునందు
లోపలికిఁబోవఁగాఁ ద్రోవ దోపకుండ. ౧౮౯

ఉ. వేగిన రామకేశవులు వేగమె నిద్దుర లేచి పైనపై
సాగిదారం గనుంగొనెడు సంబరమెక్కుడుగాఁగఁదూగి రా
గా గడపాగి కొండయునగాఁ గనుపట్టెడు గబ్బిఁజూచి యీ
యాగడ మాదుమావునది యంచు వచించి నలప్పడోపికన్.

చ. వెనుకటి కాళ్లుచేనొడిసి విక్కుచులాగినఁ గట్టుకంబము
ల్వెనఁగి పెకల్చి గీయనుచుఁ బెద్దయెలుంగున మోరద్రిప్పి వె
న్నని వినుముట్ట బంతిక్రియ నూకొని చిమ్మిన సొమ్మలేక వెం
టనదిగి ముక్కుదన్నె మరిడాపలికాలనరంబు లుర్లఁగన్.

ఉ. ఆబిసనైన తన్నునకు నాగి దిగుల్దిగనాడి గబ్బిపై
రా బలిమిన్నెకల్బెఁ జెదరన్గుదురు ల్మెడి గోరలు న్నెవ్వ

ల్గాబలు ద్రిప్పి తెంపె హరి గొప్పకసిం బసవ త్తిమీఁదరాఁ
గా బరుసైన ముట్టెఁగడఁక న్మొలిద్రిప్పినఁగూలె నేన్గుదాఁ.

గీ. క్రిందఁబడినదాని గీపెట్టఁగాఁదన్ని
తొండముసురఁబట్టి తూలవిసరి
నేలఁ గొట్టఁజచ్చె నాలుక వెలిజాపి
మింట వేల్పుమూక మేలనంగ. ౧౯౩

కం. ఏనుఁగు పీచుంగై వడ
నాన న్వ్రావటి దొలంగె నల్లయ్య కుడి
న్దోనే తేరఁగ రాముఁడు
తా నెదురంగాంచె జెట్టి తండము గరిడిఁ. ౧౯౪

గీ. చూచి నడుముగట్టి సోమరులార మీ
లావుఁ జూపిరండు సావునిజము
పోటుబంటులనుచుఁ బొరినమ్మి మీరాచఁ
డోడఁగాంచి దిగులుతోడఁజచ్చె. ౧౯౫

సీ. అని కేరడంబాడ నందు చాణూరుఁడ
న్బలియుండు వడిలేచి పండ్లుగొరికి
పిలగాడవని ముందె తెలియంగఁ జెప్పితిఁ
బాత్నేతి పొగరునఁ బల్కెదార
నీవెంతనాకడ నిలువంగ నోపరు
పుడమిలో నెవ్వరుఁ బోలవినవె
కండక్రొవ్వుణగింతుఁ గదిసిన వెంటనే
త్రుళ్లుపాటిచొప్పెటఁ జెల్లఁబోదు

గీ. కానలోనాల కదుపులఁ గాచుచున్నఁ
గదియ వచ్చిన చచ్చు రక్కసుల గెడపి
విఱ్ఱవీగుటేనా పోర బుఱ్ఱఁ దెంపి
సంగడీలకు వేడుక సలిపెదఁజుమి. ౧౯౬

శా. మున్నీటం బడిపోయినం గడుపులో మోకాళ్లుసొప్పించిన
న్మన్నుంబై సవరించి డాగిన బిరానన్బాకి నోరొందిన
న్మిన్నుందన్నుకదాటి పోయినను బేర్మిన్బోడి బాపండవై
చన్నం గానల గోఁతులంగలిసినన్ జాఁగొట్టెద న్నిన్ననిన్

గీ. అనుచు నీసడించి యావుల దొరబిడ్డ
నడ్డగించె వాఁడు నంతఁమీద
ముష్టికుండు బలుని ముందర నెదుఠాగె
సాటివారుజూచి సంతసింప. ౧౯౭

వ. ఇట్లా జట్టిపోటరు లాగిన నయ్యాల గాపరిపాపలలో లచ్చి
మగం డొచ్చెంబులేని మచ్చరంబునఁ గచ్చకిచ్చగించిన
జట్టింబట్టి పొట్టం గాలదట్టిన వాఁడట్టె లేచి కట్టల్కఁజట్టు
పట్టినెట్టె నేలంగొట్ట నాగొల్లపట్టి పట్టుదప్పించి పైకెగరి
తొగరు కంట మంటలెగయ నడునెత్తి నెత్తురుజొత్తిల్లఁ
జేకొద్ది మొత్తిన నాసామః కాఁడు మోము శేపురింపఁ గావ
రమ్మునఁ గడకాళ్లొడిసి చిక్కరిచుకొని దక్కతి వింకనిక్క
కుమని విసరి పసిదొరబిడ్డను బారవైచిన నానల్లనయ్యయు
నెదురొడ్డి దొడ్డి కట్టుగఁ జేతులొడ్డి జడ్డిగంబంటు బిగించి
యూపిరి వెడలకుండఁ గుత్తుకనొత్తి పట్టిన నామల్లుం

డొల్లెడ సందుగానక గిజగిజ తన్నుకొన నేలంబెట్టి గొంతు
కోలు కాలందొక్కిన సందులేక లోఁగ్రాలుకొన్న గాలి
వెనుకతూటన దరలెనట్లాతండు మడిసినంగని రాముండంత
దాఁకఁ దనుఁదాకిన పోటరితోఁ బోరిపోరి కూకటిపట్టున
బెట్టు పిడికిట నడచినఁ దోడితోడి వెడలి నెత్తురులతోడ
నోటనూపిరి వెడలి చనియె నిట్లయ్యిద్దరు పెద్దజట్టులుంబడిన
దక్కిన వారొక్కరక్కడ లేక పంచబంగాళంబై రదియుం
తము నెఱింగి కంసుండు. ౧౯౯

ఉ. కత్తియు వేడెము ల్వ్రేలయఁగా నిరుసేతుల మీఱవచ్చినన్
గుత్తుకబంటి యీరసము గూరిన వెన్నుఁడు మింటికేగి వా
నెత్తురు ఛాఱఁదన్ని నడినెత్తిఁ బగిల్చి చురిన్మడఁటు వే
యుత్తఱిబాపి మామ నపుడంపె జమున్దొలు వంగ సత్తిచేన్

ఉ. ఆతని తమ్ము లన్న పడఁటారసి రోసముతోడ వచ్చి గొ
ల్లాతఁడ నిన్నుఁదున్మ పగనార్చెదమంచు నెదుర్చ వాలుచే
నాతులువ ల్బడల్వడఁగ నప్పుడొనర్చెఁ జికాకుసేసెఁ బెన్
రాతికిఁ దాకినం దగరు రాఁబడునే గెలుపై తలంపఁగన్.

గీ. వారిపాటుసూచి వారలఁ గనుపట్టి
వారివార లెల్ల వారుతలఁగి
పారిరంతఁ గంసు పడఁతులు పెడతల
లడచుకొనుచు నేడ్చి రచటఁజేరి. ౨౦౨

శా. మింటన్వేల్పులు పూలవానఁ గురియన్మైన రూపచ్చర
ల్జంటల్గాఁ బలునట్టువల్సలుప నోజంబెట్టుగా మద్దెల

ల్వెట్టఁదట్టుచు మాఁపుమోరలు జగన్వేఁగూడ వాపేఁడుము
క్కఁటింగూడుకవచ్చి చూచిమరలె నగ్నద్నుప్తోనింటికిన్.

క. వక్కఁపడగదాలుపు మది
రెక్కిన సంతసముతోడ నెంతయుఁగూర్మిన్
మ్రొక్కుచుఁ దలిదండ్రులఁగని
చిక్కులువాసితిరె యంచు సేమంబరసెన్. ౨౦౪

శా. కన్నీరుబ్బున మించిపారఁ గొడుకున్నారాబుతో నక్కునం
దెన్నంజేరిచి తండ్రిమంటి మిఁకమీఁదే వెంటమన్నించెదో
యన్నన్వారలబోదుజేసి తమతాతె న్నుగ్రురావించి రా
మన్నంగా నొనరించె నెల్లరు వగల్మానంగనప్పట్టునన్.

గీ. ఆతనివనుపునవాతుల
కేతీరునగాసితొలఁగి యెసగెడినటుల
నేజితికోలఁదితాటోటుల
లేతంచెగటార్చెఁ గొదువలేదనజగముల్. ౨౦౫

వ. అంతమఱియును.

ఉ. పుట్టిననాటనుండి దనుఁబొంచుగఁబెంచిన తండ్రి నందుని
నట్టిగఁ గౌఁగిలించి కొలగాములువచ్చుట లెచ్చరించి య
ప్పట్టుననుండి రావనుచుఁ బల్కుకుడెగ్గులు మీఁదఁగీడు లే
తట్టున గల్గినం దలఁప దాకొని మాన్పుదు నెన్నిరీతులన్.

సీ. అనియిట్టులూరార్చి యనిపిఁబయనమై
మందకుఁబోయి రింపొందివార
లవ్వలగొల్లల నాలమందలతోడ
వేడుకమనుపంగ వేగరులను

బనిచియుఁ దానేగుపట్ల నందఱఁజేరి
ముచ్చటలరయుచు ముదితలడుగఁ
గోరికలుఱియుచు గురిగల నేస్తులఁ
గని కూర్మి నెరపియు గారవమునఁ
గీ. బనిచె నిక్కడ మదిరెలోఁ బెద్దరాచఁ
ద్యుగసేనుండు లేఁడుగా నునిచి తాను
తల్లిదండ్రులవలెఁ బజలగవులరసెఁ
గాలయవనాదు లలబరిగాఁ జరిప
ద్వారకయొసర్చి యచ్చటఁజేరెఁ బిదప. ౨౦౯
కం. యీకతమునుగించి శుకముని
యేకతమజరించె జరిగె నేలికయుచు నే
షోకలుడిగి నల్లయ్యాను
జోకందలపోసి మ్రొక్కిజోకుచునుండెణ్. ౨౧౦
కం. సిరిలేఁడు మేనమామం
దరిగినకత నెవ్వరేనిఁ దగఁ జదివిన నె
ల్లరు వినఁజెప్పిన సిరులం
బెరుగుచుఁ దదిముత్తిగంద్రు పెనువగ లుడుగుణ్
కం. చందురుఁ దలనమరిచి జడ
లందున వినువాఁకనిలిపి యురమేనునసిం
పొందఁగ మలపట్టింబెను
పొందించుచు నొసటకన్ను నొనరెనుసామీ. ౨౧౨
ఉ. చిచ్చటకన్ను వేదలల చిల్వటకాలఁ బొసంగుమెట్టె వె
న్వచ్చెడి బంటు లాగడపు వేసములందు పిసాసులంట కా

డిచ్చుచు వచ్చులోఁగిలట యేవపుబూడెద మేననంట మే
లిచ్చెడిపేరు మీాకొనరుకొట్టులో యబ్రము గిత్తతత్తడీ.

పంచచామరం. కడానకొండ వెండిగట్టు కాపురంపుటిక్కవై
బెడంగుమీర మాని చట్టుబిడ్డమీఁది కూర్మి నీ
సడంబు లేక నిల్లటంచు సల్పురీతి నీకువల్
వడింజమర్పు మంచుగంటి వాఁగనున్న వేలుపా.

సీ. ఇవపు పెన్మలబిడ్డ యొకిమీాని నెనరు
చేఁదోఁచిన యల్లిక దొలకువాఁడఁ
శాటిబండనుపేర బరగు నిల్వాడినొప్పి
పురుషోత్తమాఖ్యఁ బెంపొందినాఁడ
గిన్నెపేరిటివాని వెన్నుండు కూల్చిన
కతలన్ని జతపెట్టఁ గడఁగినాఁడఁ
దెలుఁగునఁ గబ్బంబు గలిగింప సమకట్టి
తిందు మూఁడవపాళె మిటులముగిసె

గీ. దీని నెవ్వరు పుడమిని దీపులమరఁ
జదివినను బెద్దవారికి సరవిదెలుపఁ
దనకు దానె సిరుజ్జేరుఁ దలఁగుఁ గీడు
లట్టివారికి నల్లయ్య డనువుపరుప. ౨౧౫

క ం స వి జ య ము.

మూఁడవపాళము ముగిసెను.

# తప్పొప్పుల పట్టిక.

పీఠికలో 19 వ పేజీలో

| తప్పు. | ఒప్పు. |
|---|---|
| మన కవిగారి అన్నగారైన ఆదెమ్మగారు | మన కవిగారి తమ్ముండైన ఆదిలక్ష్మమ్మగారు |

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 12 | క్రీము ... నేచి | లేము ... లేచి | 38 | 12 | రాలి | రాసి |
| 5 | 1 | ఫ్రట్టు | ఫ్రట్టి | | 15 | రబ | రఖరబ |
| 8 | 20 | సతం | యతం | 34 | 2 | సేసుటు | సేయుంటు |
| 9 | 19 | వోట్టు.. పాటు | పట్టు...పాటి | 37 | 2 | క్మోగిణ్ | క్మోలిణ్ |
| 10 | 6 | వేగెలు | వేవెలు | | 14 | టుసంజె | టిసచె |
| ,, | 10 | జాట్టి | జాట్టు | 39 | 6 | రంబబ | రంబ |
| 11 | 3 | ట్లుంటేని | ట్లుస | 42 | 19 | పిపాసు | పిసాసు |
| | 7 | బుట్టు | ఫుట్టు | 43 | 1 | తేనిగేస్త | రాయనుంగ |
| 12 | 16 | జేర | చేర | 46 | 2 | జివ్న | జిన్న |
| | 17 | వారుటం | వారలం | | 20 | బెన్యడిణ్ | చెన్యడిణ్ |
| 13 | 1? | చెనటు | చెనటి | 48 | 6 | దాత | ఆత |
| | 18 | కొమ్మలు | కొమ్మలు | | 14 | యద్ద | యడ్డ |
| 14 | 16 | నరవృడు | వరవృడు | 50 | 1 | మొడ్డన | మొడ్డు |
| 15 | 21 | కేటుకి | కేటికి | | 14 | తుదిగ | తుది |
| 16 | 23 | శఅలం | వఅలం | 51 | 12 | ఫ్రట్టి | పుట్టు |
| 17 | 12 | వెన్నెం | వెన్నెం | 54 | 22 | బాటున | చాటున |
| 19 | 9 | డవ్వలు దక్ష | డవ్వలుందక్షు | 55 | 7 | బొట్టియ | పొట్టియ |
| | 14 | సామినిగొల్లడిం | సామియుంగొ | | 16 | యద్దైవ | యదైన |
| | ,, | టుబుక్కసా | ల్లనింటబుట్టువా | 56 | 16 | కూటికలు | కూటువలు |
| 28 | 19 | కడపలి | కడపటి | | 17 | కొడు | కొడుకు |
| 29 | 1 | బొట్టి | బొట్టె | | 22 | లూడలు | లూడలు |
| 31 | 11 | బాటు | లాటు | 57 | 20 | ద్రొహ్మడు | ద్రొహ్మడు |
| | 20 | పజ్జ | పజ | | 21 | బూని | భూని |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 58 | 8 | రుతె | సుఁదె | 89 | 11 | టులనాద | టులఁద |
| | 13 | చౌ.. ముమకక | సరి.. ముడుగక | 90 | 4 | తెక్క—టు టు | తక్క—టుకటు |
| 59 | 9 | నుందు | యుందు | 92 | 4 | వాటినిం | వానినిం |
| 65 | 1 | నపం | నకం | | 19 | బ్రద్ధి | స్పద్ధ |
| | 5 | ముద్ప | ముచ్చె | 93 | 1 | ల్మ్రాడం | ల్మ్రడం |
| | 15 | దాల్చి | హార్చి | | 3 | గాబా | గాఁబా |
| | 17 | గక్షో | రినో | | 4 | (తెంపు | తెంపు |
| 67 | 17 | తరపువం | తఊపిమొం | | 8 | పయ్యా | వయ్యా |
| 68 | 4 | బిగగ్గిజా | చియగ్గిపై | | 19 | జెపుము | జెప్పుము |
| 71 | 2 | పము | పడ | 94 | 9 | గట్టు | గట్టి |
| 72 | 17 | యుందాక | ఝుందాక | 95 | 19 | నుంచి | నుండి |
| 73 | 3 | జేయు | జేయు | 97 | 4 | ధలంటు | దలంటు |
| 75 | 9 | వల్లె | పల్లె | 98 | 4 | బోట్టు | బొట్టు |
| 78 | 14 | నొచ్చెనె | నొచ్చితె | 101 | 19 | బ్రజ | ప్రజ |
| 80 | 11 | సబో | సంబో | 102 | 4 | తోఁజనియపా | తో వెలలెఁ |
| 82 | 9 | కన్పె | కన్పె | 103 | 21 | వను | పను |
| 83 | 4 | వప్పడు | వప్పదు | 105 | 1 | నవ్వుల | దవ్వుల |
| 84 | 3 | నీటు | నేపు | 106 | 13 | బేకాము | చేకాము |
| 84 | 8 | గొల్లడఁ | గొల్లఁడ | 107 | 6 | జేడాపటు | చేడాపటు |
| | 11 | తడవటినుంచి | తడవులనుండి | 112 | 8 | తోటి | తోడి |
| | | దాలుపనామొ | దాలిచియాము | 113 | 21 | యడ | నెడ |
| 85 | 19 | వెట్లు | లెట్లు | 114 | 2 | రొకటి | రొఁకటి |
| 86 | 10 | జాలరనిఁ | జాలరని | | 10 | గేక | గూఁక |
| 87 | 3 | ల్వాను | ల్పవి | 117 | 14 | వీఁడిది | లీఁడిది |
| | 4 | పుంబాపల్ల | పున్నాయన్గ | 118 | 6 | పైదవి | పైదలి |
| | | విందూర | లండాఁచి | | 21 | ప్రమానఁబి | ప్రమానపి |
| | 5 | గాఁప్రేరేచి | లొప్పంజేసి | 119 | 1 | బొగడఁదా | బొగడతా |
| | | తీయే | తీయేఁ | 120 | 17 | కవి | కలి |

ఈ గ్రంథములు వలయువారు—

రామా అండ్ కో., బ్రాంచి: తెనాలి.

లేక

భారతీ గ్రంథమండలి, సత్తెనపల్లి.

అని వ్రాయవలయును.